# వృషనామ సంవత్సర – శ్రావణ - భాద్రపదమాసములు

సం॥ ఆగష్టు

| | | |
|---|---|---|
| 1 | శు | న రా10-40 విశా రా10-9 ఉ శేవ6-32 రావ1-55ల3-25వ ఉదు8-15 మదు12-31వ |
| 2 | శ | ద రా8-13 అనూ రా8-31 రావ1-47ల3-17వ ఉదు7-23వ |
| 3 | ఆ | ఏ సా5-54 జ్యే సా6-59 రావ2-34ల4-5వ మతత్రయ ఏకాదశి సాదు4-47 |
| 4 | సో | ద్వా మ3-46 మూ సా5-40 సావ4-9ల5-40వ రావ2-51ల4-23వ [రాదు11-0 |
| 5 | మం | త్ర దు1-55 పూషా సా4-36 పవ12-24ల1-57వ దినం 31-55 తిథిద్వయం ఉదు8-15 |
| 6 | బు | చ మ12-22 ఉషా మ3-53 రావ7-52ల9-27వ పూర్ణిమాతిథి పదు11-39 |
| 7 | గు | ○ పూర్ణి మ11-15 శ్ర మ3-35 సావ7-38ల9-14వ పదు9-58 మదు3-3ల |
| 8 | శు | బపా ప10-35 ధని మ3-42 రావ11-8ల12-46వ ఉదు8-16 మదు12-30 |
| 9 | శ | వి ప10-22 శత సా4-20 రావ11-4ల12-44వ ఉదు7-25వ |
| 10 | ఆ | త ప11-4 పూభా సా5-27 రావ3-43ల5-25వ సాదు4-43 |
| 11 | సో | చ ప11-31 ఉభా రా7-5 వర్జ్యములేదు దినం 31-43 పదు12-29 తిర్గి దు3-5 |
| 12 | మం | పం దు12-47 రేవ రా9-5 ఉవ8-5ల9-49వ షష్ఠీతిథి ఉదు8-16 రాదు10-58 |
| 13 | బు | ష మ2-26 అశ్వి రా11-28 రావ7-7ల8-53వ శూన్యతిథి పదు11-38 |
| 14 | గు | స సా4 22 భర రా2-2 పవ10-6ల11-52వ ఉదు9-57 మదు3-0 |
| 15 | శు | అ సా6-25 కృ తె4-43 మవ3-23ల5-10వ ఉదు8-16 మదు12-28 |
| 16 | శ | న రా8-23 రోహి పూ ర్తి రావ10-26ల12-12వ ఉదు7-31వ |
| 17 | ఆ | ద రా10-8 రోహి ఉ7-9 మవ1-16ల3-1వ దినం 31-1 సాదు4-41 |
| 18 | సో | ఏ రా11-33 మృ ఉ9-21 రావ6-25ల8-8వ మతత్రయ ఏకాదశి పదు12-28మదు2-59 |
| 19 | మం | ద్వా రా12-28 అర్ద్రి ప11-10 రావ11-53ల1-39వ ఉదు8-16 రాదు10-56 |
| 20 | బు | త్ర రా12-59 పున మ12-33 రావ8-51ల10-30వ పదు11-38 |
| 21 | గు | చ రా12-52 పుష్య మ1-24 రావ2-25ల4-3వ మాసశివరాత్రి [తిర్గి దు12-27 |
| 22 | శు | ● అమా రా12-19 ఆశ్రే మ1-46 రావ1-44ల3-30వ అమావాస్య ఉదు8-16 |
| 23 | శ | శుపా రా11-14 మఘ మ1-39 రావ9-30ల11-4వ దినం 31-18 ఉదు7-26వ |
| 24 | ఆ | వి రా9-48 పుబ్బ మ1-7 రావ8-5ల9-37వ సాదు4-36 |
| 25 | సో | త రా7-59 ఉఫ మ12-13 రావ8-13ల9-44వ పదు12-26 మదు2-56 |
| 26 | మం | చ సా5-55 హస్త ప11-0 సావ6-32ల8-2వ ఉదు8-16 రాదు10-54 |
| 27 | బు | పం మ3-38 చిత్త ఉ9-34 మవ2-48ల4-18వ తిథిద్వయం పదు11-36 |
| 28 | గు | ష మ1-15 స్వా ఉ7-58 మవ1-11ల2-50వ సప్తమీతిథి ఉదు9-56 మదు2-55 |
| 29 | శు | స ప10-47 విశా ఉ6-17 అనూ తె4-33 పవ10-1ల11-30వ దినం 31-5 |
| 30 | శ | అ ఉ8-21 జ్యే రా3-1 ఉవ9-48ల11-18వ ఉదు7-26వ |
| 31 | ఆ | న ఉ6-1 దశ తె3-50 మూ రా1-37పవ10-33ల12-3వరావ128-ల1-38వసాదు4-32 |

## ముఖ్య పండుగలు

1. వరలక్ష్మీవ్రతము. 7. శ్రావణపూర్ణిమ. 14. స్మార్తమాధ్వ శ్రీకృష్ణజన్మాష్టమి.

22. పోలావ్రతము. 24. అగస్త్యోదయము. 26. వినాయకచవితి. 27. ఋషిపంచమి.




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# భారతీయ విజ్ఞాన వైభవము

సుప్రసిద్ధ భారతీయ నారీమణియగు శ్రీమతి సరోజినీదేవియు, ఆంగ్లవనిత యయ్యు భారతదేశమునే తన నివాసముగ చేసుకొని హిందూ మతమునే తన మతముగ నవలంబించి ప్రజాసేవ చేయుచున్న మార్గరెట్ ఇ. కజిన్సు సతియు ఈ మధ్యనే ఒకరు బొంబాయినగరములోను మరొకరు రాజమహేంద్రవరమునను గావించిన ఉపన్యాసములు అందరును గమనించదగినవై యున్నవి.

సరోజినినాయుడు సతి భారతీయ విజ్ఞాన వైభవమును గూర్చి ప్రసంగించెను. కజిన్సు సతి 'భారతదేశము ప్రపంచమున కొసగిన సంపత్తి' గూర్చి ప్రసంగముచేసి యుండెను.

ఆధునిక భారతదేశమున హిందువులకును మహమ్మదీయులకును సమానముగా చెందియున్న విజ్ఞానమును ఐక్యతయు ఏర్పడి నెలకొని యున్నవనియు, ప్రజాస్వామిక తత్వము భారతీయ సంప్రదాయమున నుండినదే యనియు సరోజినీదేవి స్పష్టపరచెను.

ఆర్యులు, యవనులు, చైనీయులు, అరబ్బులుకూడ భారతీయ విజ్ఞాన పరిణామమునకు తోడ్పడియుండిరనియు, అయితే భారతదేశముననే స్థిరనివాస మేర్పరచుకొని యుండిపోయిన మహమ్మదీయులవలన భారతీయ జీవనమున చిరస్థాయియగు పరిణతి కలిగినదనియు, హిందువులవలన మహమ్మదీయులును, మహమ్మదీయులవలన హిందువు

లును పరస్పరము లాభములు బడసిరనియు, ఇందువలన మహమ్మదీయులకు సౌభాగ్యము చేకూరినదనియు, భారతదేశమును భాగ్యవంతమైనదనియు సరోజినీదేవి చెప్పెను.

అసలు విజ్ఞానమనగా, అది భాష ఆచారవ్యవహారములు కర్మకాండ—వీటి యందే యిమిడియుండునది కాదనిరి. అది ఎల్లకాలమునకు ఒకటే స్థిరమైనది కాదనియు, నిత్యనూతన జ్ఞానమువలనను అనుభవమువలనను సదా మారుచుండునదనియు చెప్పిరి. పైకి కనుపించు నానాత్వము (వైవిధ్యము) అంతరమున గల సర్వమానవ ఏకత్వమును సహోదరత్వమును ఈ విజ్ఞానముయొక్క ముఖ్య ఆశయము లనిరి. అదొక జీవిత విధానమనిరి.

ఎన్ని రాజకీయ ఆర్థిక విభేదములున్నను భారతీయ జీవనమున ఈ విజ్ఞాన సంయోగము గోచరమగుచునే యున్నదనిరి. రాజకీయాది వైషమ్యములు విస్మృతమై నపుడు హిందువులకు మహమ్మదీయులకును సమానమైన యీ విజ్ఞాన వాహిని ఎప్పటి వలెనే ప్రవహింపగలదనిరి.

భారతీయ శిల్పము, నాట్యము, సంగీతమును యీ జాతియొక్క ప్రతిభను ప్రకటితము చేయునట్టివనియు, ఇందుకు హిందువులును మహమ్మదీయులునుకూడ తోడు పడియుండిరనియు, ఉభయజాతుల సంయుక్త కృషి పరిశ్రమలవలననే ఈ విజ్ఞానము అభివృద్ధియైనదనియు, అదేవిధముగ హిందూ మహమ్మదీయుల సంయుక్త కృషి ఫలితమే నేటి హిందూస్థానీ భాషయనియు ఉదాహరించిరి.

సర్వమానవజాతి యంతర్గతముగనున్న ఏకత్వమునే ప్రధానముగ సూచించునదే విజ్ఞానమనియు, అట్టి ఐక్యతను ఐకమత్యమును వృద్ధిచేసి బలపరచుటయే మన వారసత్వపు హక్కుగు విధియనియు సరోజినీదేవి తన గంభీరోపన్యాసమున ఉద్బోధచేసియుండెను.

ఇక, కజిన్సుసతి చెప్పినది:—భారతదేశపు అహింస, ఆత్మశక్తి, అద్వైత తత్త్వము, ప్రజాస్వామిక ఆదర్శములు, నాటకరచనాకౌశలము, వేదాంతాది శాస్త్రములు, శిల్పము, నిర్మాణశీలత్వము—వీటివలన ప్రపంచవిజ్ఞానమునకును సభ్యతకును అమూల్యమగు సంపత్తి చేకూరినదనిరి. భారతదేశము ప్రపంచవిజ్ఞానమునకును బహుముఖముల తోడుపడినదని ఉదాహరణముల నిచ్చిరి. భారతీయ నాట్యము, కవిత్వము, సంగీతము, సాహిత్యము, లలితకళలు, శాస్త్రవిద్యలు అత్యంత ప్రశంసాపాత్రములని ఈమె వర్ణించెను.

ప్రపంచమున ఏ యితరచోటను అజ్ఞానాంధకారము తొలగక పూర్వమే ఎప్పుడో అనేకశతాబ్దముల ముందుగనే, భారతదేశమున విజ్ఞానభానూదయమై నాగరికతా దీప్తి వ్యాపించెనని చెప్పెను. భారతీయ మతధర్మమునుండి వేదాంతమునుండి సకల ప్రపంచమును జ్ఞానప్రకాశము నొందినదనిరి.

వేయి సంవత్సరములకు పూర్వ మెవ్వడో నిర్మింపబడియుండిన అజంతాలోని పదునాలుగు గహలయందలి అసమాన అద్భుత దోషరహిత చిత్రకళాసంపదను కజిన్సు సతి పేర్కొనెను.

శాక్యమునియగు గౌతమబుద్ధుని మహత్తర సందేశము నీమె పొగడినది. అతడు బోధించిన అహింసావ్రతమును, ఆయన వ్యాపింపజేసిన మత ధర్మమును భారతదేశము విశాల ప్రపంచమున కొసగిన అమర సందేశము లనిరి.

శ్రీ శంకరాచార్య, రామకృష్ణపరమహంస, స్వామి వివేకానంద మొదలయిన వారు మత వేదాంతములయందును; జగదీశచంద్రబోసు, సర్ సి.వి. రామన్ ప్రభృతులు విజ్ఞాన శాస్త్రములందును; విశ్వకవి రవీంద్రనాధ ఠాకూరు సాహిత్యమందును; రుక్మిణీ అరండేలుసతి, ఉదయశంకరులు నాట్యరంగమందును; శ్రీ గాంధీ మహాత్ముడు నేటి భారతీయ జాతీయ నవజీవనమందును సంస్తవనీయులని ఈమె పేర్కొనెను.

సాహిత్య ప్రపంచమున భారతీయ నాటకము అద్వితీయ స్థానము నాక్రమించినదనియు, యీ రచనలలోని తత్వము చిట్టచివరకు మంచితనమునకే విజయము చేకూరగలదను విశ్వాసమనియు, అందువలననే భారతీయ నాటకములందు విషాదాంత పరిణామ ముండుట అరుదనియు, భారతీయ నాటకములలోను పురాణములలోను ఉపనిషత్తులలోను కథాకల్పనలలోను కూడ ప్రపంచమందలి జనులు తెలుసుకొనవలసిన ఆధ్యాత్మిక సందేశములు ఇమిడియున్నవనియు ఈ పాశ్చాత్యనారీమణియగు భారతదేశ భక్తురాలు చాటెను.

భావావేశమును ఉత్సాహానందమును పురిగొల్పు వక్తృత్వము లీమె రెండును.

ఇట్టి విశేషవిజ్ఞాన సంపత్తి గలిగియున్నను, మన మాతృదేశము నేడు రాజకీయముగను ఆర్థికముగను భౌతిక సంపత్తియందును వెనుకపడియుండుటకును పరాధీనమైయుండుటకును కారణము స్వాతంత్ర్యము స్వరాజ్యము లేకుండుటయేగదా?

రాజ్యముల కొఱకును, ప్రజాస్వామిక ప్రభుత్వ సిద్ధాంత రక్షణకును అటు యూరోపులోను, యిటు దూర ప్రాచ్యముననను మహాసంగ్రామ అనల జ్వాలలు వ్యాపించుచున్న ఈ సమయమున అస్వతంత్రులమైన మన గతియేమి? నూతన ప్రపంచ విధానమునకు మనమెట్లు తోడ్పడగలము? అను ప్రశ్నలు విచారణీయములు.

భారతదేశము యిప్పుడు సత్వరముగ జాతీయ ప్రభుత్వమును, సమాన స్వాతంత్ర్య ప్రతిపత్తిని కోరుచున్నది. ఇందుగూర్చియే అఖలభారతమహిళామండలి ప్రతినిధులు ఆంగ్లస్త్రీలకు వ్రాసిన ప్రత్యుత్తరములో హెచ్చరికలు చేసియుండిరి. అయితే మనము మంచికాలముకొఱకు వేచియుండవలసినట్లున్నది!

# ★ స్త్రీ సాముద్రిక శాస్త్రము ★

కవికోకిలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

(గతసంచిక తరువాయి)



అరచేయియొక్క పొడవు వ్రేళ్లకంటే ఎక్కువగానున్నయెడల మనస్సెప్పుడు విశేష భావములతో నిండియుండును. వ్రేళ్లకంటే పొట్టిగా నుండిన తెలివిగలిగి పనులు చేయుటను, సూక్ష్మజ్ఞానము, చురుకుదనమును సూచించును.

హస్తము, వ్రేళ్లు, సమాన పొడవుగా నుండిన, బుద్ధికుశలతయు, సమగ్ర భావమును, న్యాయాన్యాయ విచక్షణ జ్ఞానమును సూచించును.

అరచేయి పల్లము గుంటవలె మిక్కిలి లోతుగా నుండిన దురదృష్టమును, కష్టమును సూచించును.

అరచేయి ఎండుబారి కదలించుటకు సాధ్యముగాక యుండిన ఏకార్యమునందును ఆలస్యము గలిగియుండుటను సూచించును.

## అరచేయి వర్ణము

తెల్లని రంగుగలచేయి చూచుటకు స్వచ్ఛముగాని తెలుపురంగు గలచేయి రక్త ప్రసారము తక్కువగుటచేత కలుగును. ఇది విషయములందు వాంఛలేమి, ఆరోగ్యములేమి, ఉత్సాహ హీనత, మనశ్చాంచల్యము వీటిని దెలుపును.

పాలిపోయి అతితెల్లగా నుండిన వాత తత్వము, పాండు రోగము, చైతన్య హీనతను దెలుపును.

పసుపురంగుగల అరచేయి పిత్తాశయ రోగమును దెలుపును. మరియు అడకువ, మితభాషిత్వము, అధైర్యమును సూచించును.

గులాబిరంగుగల చేయి సంతోషము, ధైర్యము, సౌఖ్యము, భావోద్రేకము, చులుకుదనము, ఆరోగ్యైశ్వర్యమును సూచించును.

కుంకుమ వర్ణముగల చేయి కోపము, సాహసము, రక్తాధిక్యత, ఉద్రేకము వీటిని సూచించును.

నీలవర్ణముగల చేయి దౌర్బల్యము, శరీరము నందొక దీర్ఘవ్యాధి వ్యాపనము, బలహీనము, దుఃఖము వీటిని సూచించును.

మిక్కిలి నలుపుగల చేయి ఈర్ష్య, అహంకారము, శీఘ్ర మృత్యువు, వీటిని సూచించును.

అరచేతియందు నల్లని డాగులు కనబడిన చర్మవ్యాధులు, సుఖవ్యాధులు, చెడురక్తము, మనోదౌర్బల్యము వీటిని సూచించును.

అరచేతి యందు తెల్లని డాగులు కనబడిన జీర్ణించిన చర్మవ్యాధులని ఎఱుంగ తలయును. ఇది అట్టే శుభ సూచకము గానేరదు.

## శ్రీమతి కాళ్లకూరి మహాలక్ష్మీ సుందరమ్మ (డబుల్ యం. ఏ., యల్. టి.) గారి

# నిర్యాణము

[ శ్రీమతి విద్వత్కవితిలక కంచనపల్లి కనకాంబగారి సంతాపము ]



స్వర్గీయ కాళ్లకూరి మహాలక్ష్మి సుందరమ్మ

మరణం 19-7-1941

గీ॥ నీ ప్రమాణబుద్ధి, నీ త్రికరణశుద్ధి,
నీదు శక్తియుక్తి నీ మృదూక్తి,
నీ విరక్తి, రక్తి నీ పతిభక్తియు,
స్త్రీలలామములకు, మేలుబంతి ॥

చం॥ ఇరువదియైదు వర్షముల
కే శతమానము నిండెనీకు! సుం
దరి! వరలక్ష్మి, శారద ము
దంబునఁ గొల్వఁగఁ జెల్వుమీరు కాఁ
కరిఁ బురుడించుచున్ సిరియు
జ్ఞానము శక్తియు గల్గి వెల్గుచున్
హరహర! వుండి యారీతి కదా
జగమంతయు మున్గఁ జీకటిన్ ॥

మ॥ కలిలో నాలవపాలు ధర్మమని వ
క్కాణింత్రు నీపాలిటన్
వెలయున్ ధర్మము నాల్గుపాళ్లనుచు వి
ద్వేషించి నీ యాయువున్
గలియే మ్రింగెను పంకజాతములు కం
దంబోవునే యెండనేన్
దొలిజామే జలజాప్తు డాకసమునం
దున్ ముంచె వెల్గున్ దగన్ ॥

కం॥ మిన్నేటి మన్ను వెన్నయు వెన్నెల తెలివియును గళలు విన్నాణముగా
నన్నలువ కలిపి సుందరి నిన్నిర్మాణంబొనర్చె నిజ ధీగరిమన్ ॥

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః .

# ★ నక్షత్ర ఫలితాలు

కవికలహంసి
శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

● శ్రావణమాసము ●

అశ్విని
రాజభయము, దెబ్బతగులుట, ఆశాభంగము

భరణి
విద్వద్గోష్ఠి; ధనాగమనం; శుభవార్త

కృత్తిక
ఉద్యోగలాభము, శుభప్రాప్తి, ధనార్జన

రోహిణి
మృష్టాన్న భోజనం, బంధుప్రీతి; మనోల్లాసము

మృగశిర
గోలాభము, సుగంధవస్తువులలో లాభము; కుటుంబ సౌఖ్యము

ఆర్ద్ర
శిరోవ్యాధి, తాపజ్వరం, నష్టము

పునర్వసు
చోరభయము; క్రోధము; కలహము

పుష్యమి
యుద్ధభయము; విషభీతి; బంధువిరోధము

ఆశ్లేష
గర్భశూల; చిక్కులు; నీచసేవ

మఖ
అగ్నిభయము, అపవాదు, కోర్టువ్యవహారం

పుబ్బ
యాత్ర; ఉపన్యాసం; సన్మానం

ఉత్తర
స్థానము; పుత్రసౌఖ్యము; ధనప్రాప్తి

హస్త
ప్రవాసన్మానము; శరీరసౌఖ్యం; వస్త్రలాభం

చిత్త
యత్నకార్యసిద్ధి, సంగీతం, గృహమందు శుభం

స్వాతి
ప్రయాణము; శరీరపీడ; రాజభయం

విశాఖ
ధననష్టము; బంధనం; రాచకార్యం

అనూరాధ
దుష్టభయం; అధికారం తగ్గుట; కలహం

జ్యేష్ఠ
చతుష్పాజ్జీవజంతువుల నాశం; స్థానభ్రంశం; కర్మబంధునాశం

మూల
జ్వరము, విచారము, దారిద్ర్యము

పూర్వాషాఢ
సద్గోష్ఠి;మణులవర్తకమువలన ద్రవ్యప్రాప్తి; శ్రేయస్సు

ఉత్తరాషాఢ
సుకీర్తి; ధర్మకార్యము; మనః సంతుష్టి

శ్రవణం
వాతాధిక్యం; పుత్రవైరం; ఉద్యోగభంగం

ధనిష్ఠ
ప్రవాసం; ధాన్యనష్టం; చీకాకు

శతభిషం
బంధువిరోధం; క్లేశం; కాసరోగం

పూర్వాభాద్ర
మనోవైకల్యం; రాజకోపం; దూషణం

ఉత్తరాభాద్ర
కార్యవిఘ్నం; మానహాని; రోగం

రేవతి
బలహాని; అధికారం; జ్ఞాతివైరం

'నా భారతదేశ యాత్ర'

# గ్రంథసమీక్ష

మే. స. శ.

సుప్రసిద్ధ ఆంగ్ల రాజకీయరచయిత అయిన హెచ్. యన్. బ్రెయిల్స్ఫర్డ్ గారి ఆంగ్ల గ్రంథానికి ఇది అనువాదం. అనువాదకులు శ్రీ కాళోజి నారాయణరావుగారు. ప్రకాశకులు దేశోద్ధారక గ్రంథమాల, సికింద్రాబాదువారు. 174 పుటల గ్రంథం, వెల ఎనిమిది అణాలు.

బ్రెయిల్స్ఫర్డుగారు సుప్రసిద్ధ ఆంగ్ల రాజకీయరచయిత అన్నాను. అవును. ఆయన ప్రపంచములోని ఆధునిక భావాలు, ఉద్యమాలు, రాజకీయ స్థితిగతులు క్షుణ్ణంగా తెలిసిన మనిషి. వివిధదేశాలయొక్క పరిస్థితులు బాగా తెలిసినవాడు.

అటువంటి బ్రెయిల్స్ఫర్డ్ గారు 1930_వ సంవత్సరంలో మనదేశంలో జరిగిన సత్యాగ్రహం రోజుల్లో మనదేశానికివచ్చి స్థితిగతులను బాగా పరిశీలించి తన అనుభవాలను పుస్తకరూపంగా ప్రకటించాడు. అప్పటి మన పరిస్థితులను ఆయన బాగా అర్థంచేసుకున్నాడనే చెప్పాలి.

మన దేశంలోని ఉద్యమాలనుగురించి విశాల హృదయులు, నిష్పక్షపాతబుద్ధి గలవారు, ప్రపంచంలోని వివిధ పరిస్థితులు క్షుణ్ణంగా తెలిసినవారు అయిన పై దేశస్థులు ఏమి అనుకుంటారో, వాటిని గురించి వాళ్ల అభిప్రాయాలేమిటో తెలుసుకోటం మనకు ముఖ్యం. ఎందుకంటే మన ఉద్యమాలని వాళ్లు చూసిన దృష్టితో మనం చూడలేం. ఉదాహరణకి కడు బీదవాళ్లుంటారు. వాళ్ల పరిస్థితి చాలా అధోగతిగా ఉంటుంది. అటువంటి వాళ్లకు వాళ్లకన్న మంచి పరిస్థితులలోఉన్న సహృదయులు వాళ్ల పరిస్థితి చాలా అధోగతిగా ఉన్నదని చెప్పేవరకూ ఆ బీదవాళ్లకు తమ పరిస్థితి తమకే తెలియకపోవచ్చు. అట్లాగే సహృదయులగు పాశ్చాత్యులు మన దుర్భర పరిస్థితులను సరిగా అవగాహన చేసుకోటంలో మనకంటె ఎక్కువ సమర్థులు. వాళ్ల అభిప్రాయాలు మనకు మార్గదర్శకంగా ఉంటాయి.

ఈ పుస్తకంలో బ్రెయిల్స్ఫర్డ్ గారి అభిప్రాయాలుకూడా అటువంటివే. ఆయన నిశితమైన పరిశీలనాశక్తికి ఉదాహరణగా నెహ్రూపండితుడిమీద ఆయన అభిప్రాయాన్ని తీసుకోవచ్చు "ఇతనికి మహాత్ముని తత్వమందు విశ్వాసములేదు. పురాతన భారతీయ సాంప్రదాయమందును ఆచారమునందును అతనికి విశ్వాసములేదు అందరితో సానుభూతి మిత్రత్వముగానుండు సిద్ధాంతమతనికి గిట్టదు. అతడు సామ్యవాది. సామాజిక సంఘర్షణ తదుపరి ధన విభజన జరుగనిదే కృషికులస్థితి బాగుపడునని అతడు నమ్మడు. జమీందారులతో పెట్టుబడిదారులతో పోరాటము సలుపుటకు అతడు అసమ్మతిని తెలుపడు... అతను జాతీయవాదమునకు ప్రాముఖ్యమునిచ్చి, సామ్యవాదమును చులకనగా చూచుచున్నాడని చెప్ప వీలులేదు. కాని సమాజస్థితిని మార్చి సామ్యవాదమును ప్రబలించుటకు జాతీయ స్వాతంత్ర్యము తప్పనిసరి యని మాత్రము అతని అభిప్రాయము." జవాహర్ లాల్ నెహ్రూ పండితుడి దృక్పథాన్ని చాలా నిజంగా కనుక్కున్నాడు గ్రంథకర్త.

'భారతీయుల ఓర్పు'ను గురించి వ్రాస్తూ "నాకు ఇటువంటి ఓర్పు గిట్టదు. ఇటువంటి ఓర్పును నేను కడుహీనముగా చూచెదను. ఈ ఓర్పుచేతనే వారు (హిందూదేశీయులు) పూర్వకాలమునుండి ఎడతెగకుండా విదేశీయదాడులకు గురియై దౌర్జన్యములను భరించుచు, జీవనము గడుపుచున్నారు......దీనిచేతనే వారు బానిసలై శక్తిగల పాశ్చాత్యజాతియొక్క తన్నులకు, గుద్దులకు, లాఠీదెబ్బలకు, రాళ్లదెబ్బలకు, కత్తిపోట్లకు గురిఅగుచున్నారు. ఈ ఓర్పువలననే కఠినహృదయులగు ఆంగ్లేయులు వీరిని మరింత పీడించి అగౌరవముగా చూచుచున్నారు. (ఇట్లు వారు చేయుచువచ్చిరి, చేయుచున్నారు.) కుక్కకాటుకు చెప్పుదెబ్బయను నీతి ఈ హిందువులకే తెలిసియున్న వీరికీగతి పట్టియుండదు"అని వ్రాశాడు. కాంగ్రెసులోనుంచి తను చీలిపోవటానికి మొన్న నీమధ్య మున్షీ గారు చూపిన కారణాల మోస్తరుగా ఉన్నై ఈ అభిప్రాయాలు అచ్చంగా.

గ్రంథకర్త స్త్రీలలో కొన్ని అభివృద్ధిసూచకమైన మార్పులు వచ్చినై అంటాడు. కాని 'అల్ప సంఖ్యాకులగు ఈ (స్త్రీ) విద్యావంతులలో ఈ మాత్రము మార్పుజూచి అవిద్యావంతులలోను ఇటువంటి సంస్కారము గలుగుచున్నదని తలచుట పొరబాటు,' అనికూడా అంటాడు.

ఇంకా, భారతదేశపు దారిద్ర్యాన్ని గురించి, భారతదేశముపైని అన్యాయమైన ఋణభారాన్ని గురించి, భారతదేశముయొక్క భవిష్యత్తును గురించి గ్రంథకర్త అమూల్యమైన తన అభిప్రాయాలను అందరికీ అర్థమయ్యేటట్లు, చక్కగా వ్రాశాడు. ఆయన అభిప్రాయాలు నిష్పక్షపాతమైనవి, మనదేశాభివృద్ధిని కోరుతూ వ్రాసినవీనూ.

.........'ఆంధ్రముతప్ప వేరుభాష లెరుగని ఆంధ్రసోదరులలో ప్రపంచజ్ఞానము కలిగించుటకును, ఆంధ్ర సోదరులకు మాతృభాషలో అవసర గ్రంథములను అందుబాటులోనుంచి మాతృ భాషాభిమానము కలిగించుటకును సేవచేయుటయే ఈ గ్రంథమాల ముఖ్య ఆశయము' అని దేశోద్ధారక గ్రంథమాల, సికింద్రాబాదు వారు తమ ఆశయాల్లో వ్రాసుకున్నారు. కాని, వారికి ఆంధ్రముతప్ప వేరుభాష లెరిగిన ఆంధ్రసోదరులలో కూడా ప్రపంచజ్ఞానాన్ని కలిగించవలసి ఉంటుందని తెలియాలి. ఎందుకంటే స్కూలుఫైనలువరకు చదివి మానేసిన తెలుగువాళ్లు ఈ గ్రంథాన్ని ఇంగ్లీషులో చదివి అర్థంచెసుకోగలరని నే ననుకోను. ఇంకా, ఎక్కువ ఖరీదుకు అమ్మబడుతూ ఉండే ఆంగ్లభాషలోని ఇటువంటి రాజకీయగ్రంథాలు ఎఫ్.ఏ., బి. యే లం ప్యాసయిన మన విద్యాధికుల అందుబాటులో ఉంటాయని కూడా నే ననుకోను. అందువల్ల చక్కటి తెలుగులోకి అనువదింపబడి తక్కువవెలతో ఉన్న ఇటువంటి ఉత్కృష్ట రాజకీయగ్రంథం దేశోద్ధారక గ్రంథమాల వారి పై ఆశయంలోని ఉపయోగాన్నే కాకుండా ఇంకా ఎక్కువ ఉపయోగాలనుకూడా కలుగజేస్తున్నదని నా అభిప్రాయం. ఇటువంటి గ్రంథాలు తెలుగులోకి వస్తున్న కొద్దీ మన సారస్వతం చాలా అభివృద్ధి అవుతున్నదనీ, మనదేశపరిస్థితులు దేశముల[illegible] మూల మూలల జనానికి అవగాహనమయి దేశం ఎక్కువ విజ్ఞానయుత మవుతున్నదనీ మనం అనుకోవాలి.

శ్రీ కాళోజి నారాయణరావుగారు ఈగ్రంథాన్ని చాల బాగా అనువదించారనే చెప్పాలి. వ్రాసింది గ్రాంథికమైనా శైలి అందరికీ అర్థమవుతుంది. చాలాసులభమైనది. వ్యావహారిక భాషలో వ్రాసిఉంటే ఆధునిక భాషోద్యమానికి ఎదురీదకుండా ఉన్నట్లుండేది; పుస్తకం ఇంకా ఎక్కువ అందంగా ఉండేది. అయినా, గ్రంథమాలవారికి, పుస్తకాలు వ్యావహారికభాషలో ఉండాలి అనే నియమం వారి సత్వర పుస్తక ప్రకటనకు అంతరాయంగా ఉండేటట్లయితే మట్టుకు వారా నియమాన్ని అట్టే పాటించనవసరం లేదనే అనాలి.

మనదేశం యొక్క పరిస్థితుల్ని, అందులో గాంధిమహాత్ముడు ప్రారంభించిన రెండవ తూరి సత్యాగ్రహం రోజుల్లో మనదేశపు పరిస్థితుల్ని, గురించి ఒక విఖ్యాతిగల, రాజకీయాల్లో అధునాతన అభిప్రాయాలు కలిగినటువంటి విదేశరచయిత యొక్క అభిప్రాయాలేమిటో తెలుసుకోగోరే ప్రతి తెలుగు యువతీ యువకుడూ చదువ వలసిన పుస్తకమిది. చాల మంది యువతీ యువకులు చేసే ఖర్చులో ఈ పుస్తకం విలువ అయిన ఎనిమిదణాలు ఏమంత పెద్దమొత్తం కాదనే చెప్పాలి.

దేశోద్ధారక గ్రంథమాలవారి ప్రచురణలలో ఇది మరొక ఉత్తమ గ్రంథం.

---

# సిద్ధార్థుడు

మూలం:
శ్రీ ఏ. ఎస్. రామన్

అనువాదం:
శ్రీమతి అవధానం సీతాలక్ష్మి

[ నా టి క ]

[సమయం: ఉషస్సు. నళిని హృదయం విప్పింది.

స్థలము: అనోమాతీరం; అశోకవృక్షచ్ఛాయల్లో.

సన్నివేశము: కావిబట్టలతో సిద్ధార్థుడు తరుణ తరణిని తలదన్నుతూన్నాడు; దీర్ఘంగా యోజిస్తూ తపస్విలా నిలుచున్నాడు; ఒకచేత కమండలువూ, ఇంకోచేత యోగదండమూ; చెన్నుడు అతనికాళ్లు పట్టుకొని బతిమాలుతూన్నాడు; కంధకాశ్వం మోరజాచి ఆకాశంవైపు చూస్తూ విలపిస్తూంది; నదిమాత్రం హోరున ప్రవహిస్తూంది]

సిద్ధార్థుడు:- చెన్నా! చూడూ! తెల్లవారింది! పూవు కళ్లు తెరిచింది!

చెన్నుడు:- (ఏమీ పలుకడు; విచారంతో క్రుంగిపోతున్నాడు.)

సిద్ధార్థుడు:- సెలవు.

చెన్నుడు:- (ఆత్రంతో) ఎక్కడికీ, స్వామీ?

సిద్ధార్థుడు:- యాత్రకు.

చెన్నుడు:- సెలయేరు ఎడారిలో ఇంకిపోవలసిందేనా?

సిద్ధార్థుడు:- లేదు. కడలి కడుపులో కలిసిపోతుంది. మరి? చెన్నా! నా దృష్టిలో ఏం చూస్తూన్నావు?

చెన్నుడు:- వెలుగు. ఎప్పటివలెనే జ్యోతి!

సిద్ధార్థుడు:- మబ్బు కాదూ? నా కళ్లల్లోనో?

చెన్నుడు:- అశ్రువులు.

సిద్ధార్థుడు:- అవును. అవి రక్తాశ్రువులు, నాయనా! మానవుని అవస్థ చూచి నా హృదయం కలకల తరుక్కుపోయింది. ఆ నెత్తురే ఈ కన్నీరు!

చెన్నుడు:- అమృతపరిపూర్ణమైన జీవితాన్ని చేతులారా ఒలుకపోసికుంటూన్నారే! ప్రభూ! జగత్తంతా జ్యోతిర్మయం కావాలంటే, సృష్టి తలక్రిందు కావద్దా? చందమామలోని కందునుచూచి చచ్చిపోతాననడం వెర్రితనం. కళ్లు తెరువరూ?

సిద్ధార్థుడు:- (చిఱునవ్వుతో) ఏమన్నావు? చూడూ! నేను కళ్లు మూసికున్నానా? చిమ్మచీకట్లను చీల్చుకొని బయటపడినాను. ఇప్పుడు మరీచీ వీచికల్లో తేలిపోతూన్నాను.

చెన్నుడు: మీకు కళ్లులేవు ప్రభూ! మా తల్లి యశోధరాదేవి నగాధంలో త్రోసి పాటి పరుగెత్తుతూన్నారే!

సిద్ధార్థుడు:- గ్రుడ్డివాడా!

చెన్నుడు :-ఏమీ ! ఎవరు స్వామీ ? అంధుడా ? ఎవరు ? నేనా ? నాకు కళ్లు లేవూ ? అలల వింత సొబగులు చూచి గంతులువేస్తాను. వెన్నెలకురియు అమృత తుంపురులు మనసారా ఆస్వాదించగలను. నేనా గ్రుడ్డివాణ్ణి ?

సిద్ధార్థుడు :-చెన్నా ! నీకు బహిరంగమే కనబడుతుంది. ఆకృతి అందంగా ఉంటే అదే ఆనందమంటావు. ఆత్మ ఎంత మూలుగుతూన్నా వినిపించుకోవు. ఏం దృష్టి నాయనా, నీది !

చెన్నుడు :-ప్రభూ ! ప్రకృతిని ఎందుకు సృష్టించారు ? చూచి ఆనందించుటకు కాదూ ? ఆ పూలు ఎందుకు వికసించాయి ? ప్రేమ అంటే ఏమిటో చూపించుటకే కాదూ ?

సిద్ధార్థుడు :-చెన్నా ! నీటిబుగ్గను చూచి ఉబ్బి తబ్బిబ్బుపడతావే ! ఎంత దుర్బలుడివి, తండ్రీ ! ప్రపంచమంతా ఒకవైపు కసాయికొట్టుగా మారిపోతూంటే నీవు క్షణికసౌందర్యాలు చూస్తూ జీవితం వృధా చేస్తావు ! పంజరంలో తగులుకున్న చిలుకవలె నీ తమ్ముడు సంఘంలో దిక్కు తెలియక ఉక్కిరిబిక్కిరి అవుతూంటే, నీవు హాయిగా పాటలు పాడుకుంటూ కాలం వెళ్లబుచ్చుతానంటావా ?

చెన్నుడు:-మనమేంచేయగలము ప్రభూ?

సిద్ధార్థుడు:-సత్యము తెలుసుకోలేమా ? మనత్రోవను మనమేర్పఱచుకొని జీవిత పరమావధి చేరుకుందాం పద, నాయనా!

చెన్నుడు:- ఇప్పుడు మనం రాజబాటను వదిలేశామే!

సిద్ధార్థు:- నిన్నుచూస్తే నవ్వువస్తూంది. చెన్నా! ఇంక నేను బయలుదేరాలి. ప్రొద్దుపోతూంది.

చెన్నుడు :-నేనూ మీ వెంట వస్తాను.

సిద్ధార్థు:-రాలేవు, నాయనా! నీచేత కాదు. నీ అడుగులు తడబడుతవి. నీగుండె దడదడ కొట్టుకొంటుంది. దారినిండా ముండ్లే! (అని విసిగి వేసారి కూలబడుతాడు.)

చెన్నుడు:- అదిగో! ఆ కంధకాశ్వమెక్కితే మనము ప్రపంచమంతా ఎన్నిమారులు చుట్టలేమూ.

సిద్ధార్థు:- చెన్నా! ఆజంతువును ఎక్కి తొక్కుతానంటావే! ఎంతక్రూరుడివి తండ్రీ! మనపైన సంఘం స్వారి చేస్తూందే! మఱచిపోతూన్నావా?

చెన్నుడు:- స్వామీ! ఇంత లేతవయస్సులో మీరు ఇలా కుమిలిపోవచ్చునా ? ఆనందించవలసిన జీవితం ఎంతో ముందు పెట్టుకొని ఎక్కడికో పోతానంటారే! స్వామీ! నామాట వినరూ?

సిద్ధార్థుడు:- శోకంతోనిండిన ఈలోకంలో ఇంక ఎన్నటికీ అడుగుపెట్టను; ఒకవేళ పెట్టితే, శోకాన్ని పోగొట్టుటకే కాని, అందులో నేను చిక్కుకొని, నాజీవితాన్నే దుఃఖమయంచేయుటకు కాదు. నాదారికి అడ్డంరాకు. నన్ను వెళ్లనీ

చెన్నుడు:- రాజ్యానికి ఏంచెప్పమన్నారు ప్రభూ ?

సిద్ధార్థుడు:-వచ్చి అమృతం పంచిపెట్టుతానని చెప్పు. ఇంకవస్తా. సెలవు. సుఖీభవ!

[బయలుదేరినాడు; దూరంలో కలసిపొయ్యాడు; మధురస్వప్నంలా అదృశ్యుడైనాడు.

చెన్నుడు మాత్రం అట్టె కట్టెలా నిలుచున్నాడు. అలల అలజడిలో 'ఎక్కడికీ?' అనే ప్రశ్న వినబడుతూంది; ఆకాశంవైపు చూస్తాడు. 'శాంతి'! 'శాంతి!' అని ప్రత్యుత్తరం వినబడినది.

కంధకాశ్వం చచ్చి పడిఉంది]

# మాతృప్రేమ

ఉ॥ ప్రేమకు పెన్నిధాన మిల పెంచెడి తల్లియె, మాతృగర్భమే
కామిత వస్తుసంపదల గల్గగజేసెడి దివ్యగంగ, నా
ధీమణి శైశవంబునను ధీరతలంపుల నింపి నింపి సు
శ్రీమహి మెంచు జ్ఞానమణి చేతనిడున్ తన నాత్మశక్తిచేన్.

ఉ॥ కంచములోన బువ్వనిడి గారవమొప్పగ బుజ్జగించు పో
షించి స్వధర్మమార్గముల చిత్తమునందున హత్తజేయు లా
లించు మృదూక్తులన్ సుతుల లీలలకుబ్బును, తల్లిప్రేమకున్
మించిన ప్రేమలేదు కలిమిన్ బలిమిన్ పుడమిన్ దలంపగన్

చ॥ కడుపున గంటినంచు కనికారము తోడుత నిష్టవస్తువుల్
గుడిపి సమస్త విద్య లనుకూలముగా ధర నభ్యసించున
ట్లెడదను గోరుచున్ సుఖములే గలుగన్ జగదీశు వేడుచున్
బుడుతల మేలుగాంచ దలపోయును తల్లి యనేకభంగులన్

ఉ॥ ప్రేమరసంబు చిప్పిలగ వేడుకమీర ప్రియంబు జూపుచున్
నీమముతోడ దానె ధరణిన్ బహుభావము లుగ్గుబాలతో
సేమము గోరిపెట్టు చిరజీవివి గమ్మని దీవనంబిడున్
ధీమహితాత్మనంగవలదే గుణవల్లిని తల్లి నిమ్మగన్

చ॥ తనయుల వృద్ధికై పలువిధంబుల యోచన జేసిచేసి తా
ననువగు మార్గదర్శియయి యన్యకథాకలనాప్రసక్తులన్
జొనుపగనీక బుద్ధి బరిశుద్ధములైన చరిత్రలెన్నియేన్
వినుమని నాటజేయును ప్రవీణుల జేయగ తల్లి దైవమే!

చ॥ విసువు జనింప నత్తఱి వివేకము మాలి సహింపలేక తా
గసరినదయ్యు బిల్లలను కన్గొని వెంటనె యాదరంబునన్
వెస దరి జేరదీసి కడు బేలతనంబున చింతనొంది సం
తసమొదవంగ ముద్దిడెడు తల్లిని మించిన దైవమున్నదే?

—గిడుగు లక్ష్మీకాంతమ్మ.

# ద్రోహి

అదోవింతగా కనిపించే ఆ యిల్లు అంతపెద్దదీ అనడానికి వీల్లేదు, అంతచిన్నదీ అనడానికి వీల్లేదు. కాని ఆ యింటిని చూసేసరికల్లా మాత్రం చెప్పలేని సంతోషం కలుగుతుంది. అసలా వాతావరణం అమృతమయం. ఆయిల్లు కళాకాంతులతో కలకలలాడుతుంది. యింట్లోంచి వెలువడేవి దివ్యద్యుతులు. అది మళ్లీ సాధారణ గృహమే. యింటివాళ్లు యిబ్బందిలేకుండా కాలక్షేపంచేస్తూన్న సంసారులే.

ఆ యింటిని మరోసారి చూసేసరికి మరోవింత. అమృతహస్తులు ఆ యింట్లో ఉండేవారట. ఆ పూర్వవాసన ఆ యింటినిండా నిండుకుంది. తత్ఫలితంగా యిప్పుడందులో నివసిస్తూన్న వాళ్లకి అది ప్రసాదించినది సులభసాధ్యం కాని కళాజీవితం. అంచేతే చూసేవాళ్లకి ఆనందం. కాని అంతలోనే గొప్ప విచారం కూడాను. ఈ శోభ, ఈ ఆనందం ఎంతవయస్సు గలవో! వాటివయస్సు తగ్గిపోతేనో!! ఆనందం దుఃఖంగా మారుతుంది, గుండె కరిగి నీరైపోతుంది, దేహం కరుడుగట్టిపోతుంది. చివరకి అంతరాత్మ ఈ అనంత విశ్వంలో లీనం అయిపోతుంది. ఈ ఆందోళన అనుభవించేకన్న ఆయిల్లు శాశ్వతంగా శోభించాలని కోరుకుంటేనే మంచిది.

ఆయింట్లో నివసించేవాళ్లు యిద్దరే. పాతికసంవత్సరాల వయస్సుగల శిల్పి, అతనితల్లి అరవై సంవత్సరాల వృద్ధు. ఆశిల్పి తాత తండ్రులు, పాతాళజలం మాదిరిగా తమలోంచి ఉద్భవించే అమృతాన్ని ఖర్చుచేసి ధనం సంపాదించారు. శిల్పి తండ్రి, తనజీవిత గ్రంధంలోని ఆఖరిపుటకూడా తిరిగి పోతూన్నప్పుడు శిల్పికి 'నాయనా! యిదుగో ఈ అమృతం తీసుకో. దీనిని జాగ్రత్తగా వినియోగించుకోవాలి సుమీ—!' అన్నే ఒక్కమాటే చెప్పేడు.

తండ్రియిచ్చిన సందేశాన్ని శిరసావహించేడు శిల్పి. నిత్యం అతను చేసేపని కళారాధన. ప్రతిమలు నిర్మిస్తూండేవాడు. అందుకు సరిపోయేటంత ధనంకూడాఉంది అతనికి. ఎన్నెన్నో ప్రతిమలు తయారుచేసేడు. ఎందరో అతని కళానైపుణ్యానికాశ్చర్యపడ్డారు. శిల్పి బహు అదృష్టవంతుడు, సిద్ధహస్తుడు అని వేనోళ్ల కీర్తించారు.

మధ్యాహ్నం పన్నెండుగంటల వేళయింది. రోడ్డుమీదనుంచి ఒకకుఱ్ఱవాడు వెళ్లిపోతూ దృష్టి పక్కకి మళ్లించేడు. సజీవచంద్రకాంత శిలాప్రతిమ ఒకటి శిల్పికూర్చున్న గదికిటికీ ఊచల్లోంచి గోచరించింది. ప్రతిమముఖంతట్టు నిలింప నేత్రాలతో చూస్తూ కూర్చున్నాడు శిల్పి. చట్టున అరుగెక్కి గదిగుమ్మందగ్గర నించున్నాడు. శిల్పి చలనంలేకుండా చూస్తున్నాడు. కొన్నినిమిషాలు గడిచేయి. శిల్పి వెనక్కితిరిగి చూసేడు. ఆ అపరిచితుడిని కూర్చోమన్నాడు. సంభాషణ సందర్భంలో ఆ పరాయి అబ్బాయి ఒక దిక్కులేనిపక్షి అని తెలుసుకున్నాడు. శిల్పికి గుండె నీరైపోయింది.

శిల్పికి తల్లి మినహాయించి యింకెవరూ లేరు. కళత్రనష్టంనుంచి విరక్తిచెందిపోయాడు. తన ఉద్యమం ఉన్నంతకాలం చింతలేదు. కాని అతనికి ఒక్కటే విచారం. తన తరువాత ఆ ఆరాధనచేసే వారెవరు?

పరాయి అబ్బాయిని అభిమాన పూర్వకంగా పలకరించి 'తమ్ముడూ! నా దగ్గిరఉండి నీవుకూడా ఈ పవిత్రారాధన చెయ్యకూడదూ?' అన్నాడు. సరే అన్నట్టుగా తల ఊపేడు పరాయిఅబ్బాయి. శిల్పికి పరాయి అబ్బాయిఅంటే ఎంతో అభిమానం. అతనికి ఈ విద్య నేర్పడానికి ప్రయత్నించేడు. కాని లాభం లేక పోయింది. 'పోనీ తమ్ముడూ! నువ్వు యిక్కడే ఉండిపో' అని తనసోదరుడికి చెప్పినట్టు చెప్పేడు. యింక పరాయి అబ్బాయికి బెంగలేదు. పొట్టపోషణ ఎలాజరుగుతుందా అన్న విచారంలేదు. శిల్పి జీవించి

ఉన్నంతకాలం పరాయి అబ్బాయికి ఏలోటులేదు. సగంముగిసిన ఏ ప్రతిమచెంతనో శిల్పి రచనచేస్తూ కూర్చుంటే, నిస్సారమైన హృదయాన్ని బైటకుపంపి శిల్పి ప్రక్కనే కూర్చునేవాడు పరాయి అబ్బాయి. ఎన్నిరోజులో గడిచిపోయాయి.

శిల్పికి విచారం, పరాయి అబ్బాయికి సంతోషం. పరాయి అబ్బాయికి ఉద్యోగందొరికింది. విసుగుపుట్టించే ఈ కాలయాపన ఎప్పుడు పోతుందాఅని చూస్తున్నాడు పరాయిఅబ్బాయి. మూటముల్లే కట్టుకున్నాడు. పయనం అయేడు. శిల్పికి పట్టలేని విచారంకలిగింది. పరాయి అబ్బాయిని కౌగలించుకున్నాడు. పరాయి అబ్బాయి బండి ఎక్కేడు. 'అతని కదృష్టం లేనేలేదు-నాకు అదృష్టంలేదు' అని అంటూ అశ్రుపూరితలోచనాలతోచూస్తూ నిలబడిపోయాడు శిల్పి.

పరాయి అబ్బాయి వెళ్లిపోయాడు. శిల్పికి చాలా విచారం కలిగింది. కాని తన కాలక్షేపం తన విచారాన్ని కొంతవరకూ మట్టిపెట్టేది.

ఏ ప్రదర్శనశాలలో చూసినా శిల్పి విగ్రహాలే. శిల్పిని చూడని వాళ్లు అతనుచేసిన విగ్రహాలు చూసి ఎంతో మురిసిపోయేవారు.

పరాయి అబ్బాయి ఉద్యోగంలో ప్రవేశించేడు. అతను శిల్పిని సుమారుగా మర్చిపోయినా, శిల్పి మాత్రం పరాయి అబ్బాయిని మర్చిపోలేదు. ఆతనిమీద అభిమానం తగ్గలేదు. అతన్ని తల్చుకోని క్షణం

★ శ్రీ ఆగర వేంకట సత్యనారాయణ రావు ★

లేదు. ఏకొత్తవిగ్రహం తయారు చేసినా, ఏప్రదర్శనంలో తన విగ్రహాలకి గెలుపొచ్చినా, తనసంతోషాన్ని, పరాయి అబ్బాయికి తెలియబరిచేవాడు.

పరాయి అబ్బాయికి యిరవైరూపాయల జీతం. అతనిఅధికారికూడా ఒకశిల్పి. కాని అధికారికి, 'శిల్పి' కి హస్తిమశకాంతరంతేడా. పరాయి అబ్బాయివల్ల శిల్పిభోగట్టా, అతని ప్రవీణత తెలుసుకున్నాడు అధికారి. పరాయి అబ్బాయి శిల్పిని అభిమానంలేని పొగడ్తలుచేసేవాడు అధికారిదగ్గర. ఆ కనీసంపొగడ్తకి కూడా విరుద్ధంగా ఉండేది అధికారి హృదయతత్వం. అది గ్రహించాడు పరాయి అబ్బాయి. శిల్పిని ఏవగించుకుంటే అధికారికి సంతోషం, మనస్సంతృప్తిని. ఆ కారణంచేత స్వలాభం అపేక్షించు దిక్కుమాలిన అవస్తలో తనకుపెన్నిధియై, రక్తంపంచుకు పుట్టిన సోదరుడిలా భావించి, తనుచేసే పవిత్రారాధనలో పాల్గొ మనిసలహాయిచ్చి, చివరకి తన అభిమానం వెల్లువై పారేటట్టు 'తమ్ముడూ! నువ్వునాదగ్గిరే ఉండిపోవయ్యా' అని పలికిన శిల్పిని ఏవగించుకొనేవాడు.

అమాయకుడైన శిల్పికి పరాయి అబ్బాయి పట్ల సోదరభావం తగ్గలేదు. అతడు వెళిపోయాడు కదా అని, అతనికి అదృష్టం లేకపోయిందికదా అని విచారం, స్వతంత్రంగా అయినాగాని జీవితం గడపడానికి తగిన అవకాశం ఆతనికి కలిగిందికదా అని సంతోషం- ఈఅనుభవాలతో తల్లడిల్లిపోయేవాడు శిల్పి.

శిల్పికి గొప్పకీర్తి, కళా హృదయులకు గొప్ప ఆనందం ప్రసాదించే అవకాశం లభించింది. బుద దేవుని విగ్రహం ఉత్తమంగా తయారు చేసినవారికి గొప్ప బహుమానం. ఒక కళాసంస్థవారు ఈపోటీ పెట్టేరు. శిల్పికి ధనం అక్కరలేదు. కళారాధన, లోకులకానందం కలిగించడం అతని ఆశయాలు. ఎందరో శిల్పులు

పోటీలో పాల్గొన్నారు. అధికారికూడా పాల్గొన్నాడు. శిల్పిప్రవీణత అధికారికి తెలుసు. ఆభయం అతన్ని పీడిస్తూనే ఉంది.

శిల్పికూడా నిర్మాణం ప్రారంభించేడు. చురుకుగా రచన సాగిపోతూన్నది. కళావాతావరణంలో శోభించే ఆయింటి చిన్నగదిలో శిల్పి అమృత హస్తాలనడుమ అహింసాకంకణం ధరించిన బుద్ధదేవుడు నించున్నాడు. నిద్రాహారాలు సైతం విసర్జించి, దీక్షలో నిమగ్నుడై పోయాడు శిల్పి. ప్రతిమా నిర్మాణం సుమారుగా ముగిసింది. నిలింపనేత్రాలతో ప్రపంచ గోళాన్ని సింహావలోకనంగావిస్తూ, స్ఫటిక సన్నిభమైన దేహంలోంచి దివ్యదీధితులీనుతూ నిశ్చలంగా నించున్న బుద్ధదేవుణ్ణి అనిమిషత్వం వహించి చూస్తూశిల్పి ఒక ఘడియ ఆలోచనలో మునిగిపోయాడు. నేత్రగోళాలలో శాంతి దీపికలను ప్రకాసింప జేస్తూన్న బుద్ధదేవునికి అవ్యక్తంగా ప్రణామం ఆచరించి 'దేవా ఈఫలితం ఎక్కడికోగదా?' అన్నాడుశిల్పి.

ఆ నిశ్చలత్వం ముగిసింది. పోటీ గడువు కొద్దిరోజులే ఉంది. అధికారి శిల్పివున్న ఊరు ఏదో పనిమీద వచ్చేడు. శిల్పితో అతనికి పరిచయంలేదు. శిల్పి గృహం ముందునుంచి పోతూండగా కిటికీలోంచి శిల్పి నిర్మించిన ప్రతిమ గోచరించింది. తన ఆశలు బ్రద్దలైపోయాయి. వెంటనే తిరిగి వెళ్లిపోయాడు. శిల్పికి బహుమానం రాక తప్పదనుకున్నాడు. శిల్పిని ఎందరు కీర్తిస్తారోగదా!! శిల్పి ఎంత అదృష్టవంతుడు! గుండెల్లో మంట పట్టుకుంది అధికారికి. గృహోన్ముఖుడయాడు.

అధికారిని దర్శించడానికొచ్చేడు పరాయి అబ్బాయి. అధికారి అతనితో భారంగా కొంత సంభాషణ జరిపేడు. చివరకి ఏదో విషయం చెబుతూ........తప్పకుండా రేపే నీకా ఉపకారం చేస్తానన్నాడు.

పరాయి అబ్బాయి మర్నాడే ఊరు బయల్దేరి శిల్పి యింటికి వెళ్లేడు. త్రోవలో కొంత అభిమానం కొనుక్కున్నాడు. గబగబ శిల్పి యింట్లోకి వెళ్లేడు. శిల్పి కనిపించలేదు. శిల్పితల్లి అతనితో అభిమానంగా కొంతసేపు మాట్లాడి 'బాబు ఎక్కడికో యిప్పుడే వెళ్లేడు' అన్నది.

'మళ్లీ వస్తా'నన్నాడు పరాయి అబ్బాయి. 'సరే' అని ఆవిడ ఏదో గృహకృత్యంలో నిమగ్నురాలైంది.

నిమ్మళంగా శిల్పి గదిలో ప్రవేశించాడు పరాయి అబ్బాయి. నిమీలితలోచనాలగుండా లోకానికి శాంతిని ప్రసాదిస్తూన్న బుద్ధదేవుడిని చూశాడు. పరాయి అబ్బాయి హృదయం ఒక పాషాణం! మనస్సు ఒక మట్టిదిమ్మ!!

అతని దేహంలోంచి విషం ఒక ప్రవాహంలా పరిగెట్టింది. '......చేతనానికి కొంత పెంపు!' ......చట్టని బుద్ధదేవుని శిరస్సు విరిగి క్రిందపడిపోయింది. పరాయి అబ్బాయికి దేహం యావత్తూ ఒక్కసారి కంపించింది. తడబడుతూ పారిపోవడానికి సిద్ధంగాఉన్న సమయంలో శిల్పి గదిలో ప్రవేశించాడు. ఆ భీభత్సదృశ్యాన్ని చూసి నిలువునా నీరైపోయి 'ద్రోహీ! ఎంతపనిచేశావు! నేను నీ కే అపకారంచేశానని నా హృదయాన్ని కొల్లగొట్టేవు?' అని తెగిపడిపోయిన శిరస్సు తీసి కళ్లకద్దుకొని 'దేవా! ఈ ఫలితం ఎక్కడికోగదా?' అంటూ బుద్ధదేవుని పాదాలమీద పడిపోయాడు శిల్పి. ద్రోహి వెళ్లిపోయాడు. కాని శిల్పి పవిత్ర నేత్రద్వయం బుద్ధదేవుని పాదాలపైనే ఉండిపోయింది.

---

# అతివల యాదర్శము

శ్రీమతి వట్టి శేషాంబ



ప్రస్తుత భారత పరిస్థితులు అధోగతిపాలై యున్నవి. మనమీద వెడలు దురాచారములకు మేరలేదు. పాశ్చాత్య నాగరికతా వ్యామోహమున ప్రమాదావస్థలో నున్నాము. అంధానుకరణము మన యభివృద్ధి నరికట్టు చున్నది. సత్వములను పేరట విచ్చలవిడి నడవడి పెంపొందించుకొను చున్నాము. స్వాతంత్ర్యమన ఇంద్రియ స్వేచ్ఛావిహారమేనని భ్రాంతినొందు చున్నాము. రాయంచవలె పాలనుండి నీరును వేరుచేయ నెరుంగక అంతయు దుగ్ధమని అపోహపడుచున్నాము. అట్లు వేరుచేయుట కుపక్రమించిననాడు సత్వములు ప్రస్ఫుటితకుసుమములట్లు హాయిని చేకూర్చును, లోకామోదము పొందును.

ప్రాచీనకాలమునుండి నైతికాధ్యాత్మికములకు పుట్టినిల్లయి ఇతర దేశములకుకూడా ఆదర్శము చూపగలిగిన భారతమునందు నేడు విద్య వ్యాపించినకొలది విజ్ఞానము, హేతువాదానుకరణము నశించినది. నాస్తికత ప్రబలుచున్నది. ధర్మమునుండి దృష్టి మరలినది. తమ జీవితలక్ష్యము ధనోపార్జన, భోగలాలసత్వములక్రింద పరిగణించుచున్నారు.

ధనమననేమి? ఉన్నతాదర్శములుగలిగి జాగరూకతతో మెలగు మన స్సేకధనము. సత్కార్యాచరణము ధనము. న్యాయశీలతయు నిష్కళంక చరిత్రయు చాలా విలువైన ధనము. ఏ మానవుడైనను తన జీవితమును నియమ నిగ్రహములతో నడుపుటకు ఆధ్యాత్మికజ్ఞాన మవసరము. ఈ జ్యోతిమరీచులే ఉత్తమజీవనమునకు చలన ప్రాణము లిచ్చును ఈ జ్యోతి కొరవడిన విద్యయును, జీవితమును పైపైమెరుంగులు గలిగి బాహ్యపుష్టిని ప్రదర్శించునేగాని ఆత్మశక్తిని ప్రసాదించలేవు. వస్తాదుకు శరీరశిక్షణ మావశ్యకమైనట్లే మనస్సునకు ఆధ్యాత్మికశిక్షణ మావశ్యకము. అది నిశ్చయముగ గ్రుడ్డిగ సన్యాసమును శరీరమును శుష్కింపజేయుటయును గాదు. ప్రపంచము తనదిగాదని ముక్కుమూసుకొనుటయు గాదు.

> మనము గృహయజమానులుగా నుండి అతిధి అభ్యాగతులను పూజించుచు కుటుంబములను శాంతినికేతనములగను, అనాధశరణాలయములగను, పారిశ్రామిక కేంద్రములగను, ఆరోగ్యసంస్థలగను, లలితకళాశాఖలగను, నైతికశిక్షణాలయములగను, ఆనందవనములుగను ప్రతిష్ఠించవలెను.

మనకు నిశ్చయముగ భావస్వాతంత్ర్యము లేదు. స్వతంత్రంగా చింతనజేయగలిగే బుద్ధి పాటవము మన మలవరచుకొనలేదు. వెనుక బౌద్ధయుగమునకు తర్వాత మోక్షమునకు మార్గము సన్యసించుటయేనని తలచి ఇహమునుమరచిరి. బాలబాలికలకు భాషాజ్ఞాన, గణిత, చిత్రలేఖనాదులు చెప్పించుటకుబదులు బౌద్ధభిక్షువులుగా నిర్ణయించెడివారు. ఇంచుమించు భౌతికకార్యకలాపమున కంతకు స్వస్తిచెప్పిరి. అట్టి సందర్భములోనే భారత నాగరికత వినాశము పొందినది. భారతభాగ్యము పరసీమలపాలైనది. మన మస్వతంత్రులమైతిమి.

మానవుడు తన పవిత్రవర్తనచే లోకమును పునీతమొనర్చి ఆత్మగౌరవమును ప్రకటించి న్యాయ సమ్మతములగు సర్వవిధహక్కులను కాపాడుకొనవలెను. లేనియెడల క్షమార్హుడు కాజాలడు. ఏజాతిప్రతిభ ఆజాతి నాగరికతమీదనే యాధారపడియున్నది. ప్రజలు తమ లోపముల గుర్తించి జన్మహక్కులను కాపాడు

కోనలేని అలసులుగా నుండేయెడల వారు న్యాయముగా నేలమట్టము కాదగినవారే. వారికంతకంటెనూ మంచి యర్హతలేదు. అందుచేతనే గాంధిజీ వ్యక్తిని ఆంతరంగికముగను, నైతికముగను, ఆధ్యాత్మికముగను నభివృద్ధిపరచి తద్వారా బాహ్యావాతావరణము మార్పుచేయగోరును.

పరిశుద్ధజీవనము ధారాళమైన మనస్సు స్వచ్ఛమగు హృదయము తీవ్రజిజ్ఞాస ఆధ్యాత్మికజ్ఞానము అనునవియే మానవపురోభివృద్ధికి స్వర్ణసోపానములు.

హిమాచలముపగిది మేధస్సుకంటె రత్నాకరముబోలు సుగుణసంపదే మహత్తరమైనది. గుణములేని మేధస్సువలన తన పరిసర ప్రాంతములను నరకకూపమొనర్చగలుగును. సత్ప్రవర్తనే చిరవిరాజితమైన శాంతిని స్థాపించగలదు. ముఖ్యముగా స్త్రీలు శాంతి స్థాపకులుగా నుండవలెను. దయాన్వితమైన మాటలు స్వార్థరహితములైన భావములు ఉపకార పూరితములైన సంకల్పములు వితరణతోగూడిన హైదములు భారతనారి ఆదర్శముకావలెను.

విజ్ఞానములేని సౌందర్యము, నైతికసంపదలేని జీవితము నిరర్థకము. ఎంతటి విద్యావంతులైనను తన చిత్తమును తాను శాసించుకొననేరనివారు ఉత్తములు గానేరరుగదా?

స్త్రీ మాతృమూర్తియగుట ప్రకృతిసిద్ధము. జాతి శిక్షణమంతయు నామెచేతియందే యున్నది. మానవలోకమహత్తంతయు నామెమీదనే యాధారపడియున్నది. గనుక మహిళలు విదుషీమణులై, విజ్ఞానమూర్తులై, శీలసంశోభితలై, గృహలక్ష్ములై మిహిరతేజమునుజిమ్ము దివ్యకాంతుల నలుదిశల సారింపవలెను.

నైతిక బలాన్వితమగు స్వతంత్రభారతవర్షోదయమునకు స్త్రీ లింకను తమశక్తి సామర్థ్యములను గృహపాలనమందే చూపవలసియున్నది. స్త్రీ హృదయము లలితకళలకావాసమయి గృహకృత్యములకు సంబంధించినదంతయు వినమ్రభావపూరితమై యుండవలెను. అద్భుతభావ విలసితమగు ప్రాచీననాగరికతంతయు గృహపాలనమందే మూర్తీభవింపజేయవలయును. మనము గృహయజమానులుగానుండి అతిధి అభ్యాగతులను పూజించుచు కుటుంబములను శాంతినికేతనములగను, అనాధశరణాలయములగను, పారిశ్రామిక కేంద్రములగను, ఆరోగ్యసంస్థలగను, లలితకళాశాఖలగను, నైతికశిక్షణాలయములగను, ఆనందవనములుగను ప్రతిష్ఠించి భరతమాతకు వన్నెతెచ్చు ప్రేమాస్పదులైన పుత్రికలగా నుండవలెను. నిర్మాణకార్యక్రమమంతయు కుటుంబసేవలోనే ఇమిడియున్నది. భారతదాస్య విమోచనముగూడా హిందూగృహిణుల చేతులలోనే యున్నది. ఆమె భావతరంగములందును సేవానిరతియందును కుటుంబ, దేశ, మోక్షము లాధారపడియున్నవి. స్వర్గసామ్రాజ్యప్రతిష్ఠ ఆమె యరచేతిలోనిదే.

భారతమాత నూతనపరివర్తన కొరకు ప్రసవవేదన ననుభవించుచున్నది. మనలో నూత్నబాధ్యత, ఆత్మవిశ్వాసము విజృంభింపవలెను. అజ్ఞానమునుండి విజ్ఞానప్రపంచమునకును, అధర్మమునుండి నైతికాధ్యాత్మిక ప్రపంచమునకును మరలవలసి యున్నది.

భారతస్త్రీలు అంతఃకరణశుద్ధిగల్గి అవినీతికి లోనుగాక, స్వార్థమున కాశింపక, సత్యమును అహింసను ఆదరించే ఉత్తములు, బుద్ధిమంతులుగాకపోతే భారత పవిత్రతకు భంగం గలుగును.

నేటివరకు భారతదేశ గౌరవము దశదిశలు వ్యాపించియున్నదంటే దానికి భారతస్త్రీయొక్క అనన్య సామాన్యమైన ప్రవర్తనయే కారణమన అతిశయోక్తిగాదు. కుటుంబమేమి? దేశమేమి? నైతికబల సంపన్నులు, ఆత్మ నిగ్రహపరులు, పరోపకారపారీణులు, స్వార్థత్యాగులు గల అతివలున్న నేగదా వన్నె కెక్కును! అట్టిజాతియే విశ్వమందు తలమానికమగును.

లోకకల్యాణమునకు మానవశ్రేయస్సునకు దేశాభివృద్ధికి సంఘనిర్మాణమునకు కుటుంబపవిత్రతకు వలయు విద్య, వివేకము, స్త్రీలు సంపాదించవలయును. అప్పుడే లోకమంతయు బృందావనమగును. వైకుంఠ ధామ మగును.

---

# ఎప్పుడో!

తే॥ గీ॥ పరుల దాస్యబంధాల పాల్పడి కృశించి
ప్రాణమాత్రావశిష్టయౌ భరతసాధ్వి
ఊడిగముఁ బాపునట్టి మహోజ్జ్వలులగు
వీరపుత్రులఁగాంచి గర్వించు నెపుడొ?

చ॥ పరువుతనంబు వీడి పెరవారలసేవకు శీర్షమొగ్గి, వ
త్సర శతయుగ్మ మాదిగను చాకిరికూడు భుజింపనేర్చి సం
బరపడు భారతీయుఁ డనివార్య మహోజ్జ్వల శౌర్యరాశియై
భరత ధరిత్రి కూడిగముఁ బాపి స్వతంత్రత నేదు నెప్పుడో!

మ॥ పరదేశంబులకాది నాగరిక సంప్రాప్తిం బ్రసాదించి కీ
ర్తిరమన్ పొందినయట్టి యీ భరతధాత్రిం బుట్టువుంగన్న ధీ
వరసంతానము స్వీయనాగరికతన్ భావించి పాశ్చాత్య నా
గరికంబందలి మోహమున్ విడచి సౌఖ్యంబందునాఁ డెప్పుడో!

ఉ॥ దారియు డొంకలేని పెడదారులలోఁబడి భావశూన్యయై
వార వధూటివోలె విడఁబడ్డదియై బుధదూరయౌచు స్వే
చ్ఛారతి సంచరింపక ప్రశస్త పథంబుల వెంటసాగి మా
భారతి పూజ్యయై తెలుఁగువారికి మోదముఁ గూర్చు నెప్పుడో!

చ॥ భరతలతాంగి హస్తమున భాసిలుచున్ వసనంబుఁ గట్టఁగా
నెరుఁగని యన్యదేశజుల కెల్లను నాగరికంబు నేర్పి యం
బరముల దానమిచ్చిన కృపామయి రాటము యంత్రశాలలన్
దరిమియు హిందుదేశ భవనంబులలోన ధ్వనించు నెప్పుడో!

—శ్రీ కొప్పరపు మల్లికార్జునరావు.

# ★ పవిత్ర హృదయం

● శ్రీ వైజ్యుల లక్ష్మీనరసింహస్వామి

సాధారణంగా పురుషులే స్త్రీల పవిత్రహృదయాల్ని కలతపెడుతూంటారు దురూహాలతో. అటువంటి దురూహాలకు తావొసగక తన మనోనిశ్చయాన్ని ఎలా కాపాడుకుందో తెలియజేస్తుంది రాధ జీవితగాథ. ఎప్పుడేనా అటువంటి పవిత్రహృదయులు ప్రథమంలో ఎన్నిచిక్కులుపడ్డా చివరకు శాశ్వత సౌఖ్యాన్ని పొందగల్గుతారు.

చంద్రమోహన్ ఓ లక్షాధికారి. ఏభై సంవత్సరాలుంటాయి. యితని భార్య రేవతి. వీరికి సంతానము కలుగలేదు. యీ దంపతుల కా చింత ఒక్కటే గాని మరేలోపమూ లేదు.

ఓనాడు చంద్రమోహన్ సాయంకాలపు షైరుగా అలా పంట పొలాలవేపు కెళ్లాడు. ప్రకృతి కన్య నవనవలాడుతూ చిరునవ్వులతో ఆహ్వానిస్తోంది. అక్కడ ఓ రాతిగుట్ట వుంది. చంద్రమోహన్ ఏదో ఆలోచిస్తూ ఆ మెట్టపడ్డున ఓ రాతిపై కూర్చున్నాడు. కొంతసేపటికి ప్రక్కనుండి మాసిన చింకిబట్ట కట్టుకొని ఓ పన్నెండేళ్ల పిల్ల యితనివద్దకు వచ్చి నిలపడింది బెదురుతోన్న చూపులతో. ఆ పిల్లలో ఓ అపూర్వ తేజస్సు యిమిడిఉన్నది. చంద్రమోహనా పిల్లని ప్రశ్నార్థకంగా చూశాడు. ఆ పిల్ల సర్దుకుని లేనిసత్తువ తెచ్చుకుని—

'బాబూ! ఓ కానీ వుంటే యివ్వరూ? ప్రొద్దుట్నుండీ తిండిలేదు.'

'ఎవరిపిల్లవు నువ్వు?—' (ఓ కానీ యిస్తాడు)

'బాబూ! రామనాథ్ కూతుర్ని! నా చిన్నప్పుడే మా తల్లి చనిపోతే మా తండ్రి మళ్లీ పెళ్లిచేసుకున్నాడు. మా సవితల్లి నానాచిక్కులూ పెడుతుంది.'

'మీ సవితల్లికి పిల్లలున్నారా?'

'ఓ కొడుకున్నాడు—'

'మా యింట్లో వుంటావూ? నిన్ను పెంచుకొంటాం. చదువు చెప్పించి నీకు పెళ్లిచేస్తాను. నాకెవరూ సంతానంలేరు కూడా—నీకేం ఫర్వాలేదు.'

'మా తండ్రి యిష్టపడాలి.'

'అలాగే! మీ తండ్రిని ఒప్పిస్తా నెలాగయినా నీకిష్టమేనా?'

'ఇష్టమే—'

సంధ్యచీకటి పడుతోంది. అప్పుడు చంద్రమోహన్ ఆ పిల్లను వెంటపెట్టుకుని వూళ్లోకి మళ్లాడు.

♦ ♦ ♦ ♦

ఐదు సంవత్సరాలయింది. చంద్రమోహన్ తెచ్చిన పిల్లను ఆ దంపతులు అల్లారుముద్దుగా పెంచి చదువు చెప్పిస్తున్నారు. ముద్దుగా 'రాధ' అని పిలుస్తారా పిల్లని. రాధ యెప్పుడు నవనవలాడుతూ విద్యలో కూడా ప్రకాశిస్తోంది.

చంద్రమోహన్ ప్రక్కయింట్లో బాబూరావని ఓ కుర్రాడు స్కూలు ఫైనలు చదువుతున్నాడు. రాధకూడ స్కూలు ఫైనలే చదువుతోంది. బాబూరావు రాధ కప్పుడప్పుడు లెఖ్ఖలూ అవీ చెపుతూండేవాడు. ఇద్దరూ అరమరాభ్యంతరాలు లేకుండా మెలగుతూండేవారు నిర్మలహృదయాలతో.

ఓనాడు బాబూరావేదో చదువుకుంటున్నాడు యీజీఛెయిరులో కూచుని. అప్పుడు రాధ వీళ్లింటికొచ్చింది.

'మరేమిటి రాధా సంగతులు?'

'ఇవాళ ఫిల్ముకెళదామా? 'పుకార్'కి!'

'ఇద్దరమూ ఫిల్ముకు్కడానా వెళ్లటం?'

'ఏం? వెళితే తప్పా?'

'తప్పులేదు—పైవాళ్లేమనుకుంటున్నారో తెలుసా మన్ని?'

'అనుకోనీ!—మనకేం! మనలో అపుకు లేనప్పుడు ఎవళ్లెలా అనుకుంటే మనకేం?'

'సరే! అలాగే వెళ్దాం—'

'సాయంత్రం అయిదింటికి వస్తాను. సిద్ధంగా వుండు నువ్వు. కారులో పోదాం.' అని వాళ్లింటి కెళ్లిపోయింది రాధ.

♦ ♦ ♦ ♦

కాలేజీలో S. S. L. C. క్లాసు. క్లాసులో మగాళ్లు ఓవేపు కూర్చున్నారు. రాధ, మరో నలుగు రమ్మాయిలూ వేరే మరోప్రక్క కూర్చున్నారు. రాధ ప్రక్క లలిత అని మరో అమ్మాయి రాధ పుస్తకాలు చూస్తోంది. అందులో బాబూరావు కెమిస్ట్రీ నోటుబుక్కు చూసింది. వెంటనే మగాళ్లలో వున్న బాబూరావు వేపోసారి చూసింది. యింతలో స్కూలు వదిలేశారు. అంతా బయటికొచ్చేస్తున్నారు. లలిత రాధవద్దకు వచ్చి—

'రాధా నువ్వదృష్టవంతురాలవు సుమా!—'

'ఏం?'

నవ్వుతుంది—

'ఏం నవ్వుతావూ? చెపుదూ?'

'నువ్వు కెమిస్ట్రీ నోట్సుకేం కష్టపడకండానే లభిస్తాయి నీకు.'

'అదా సంగతి—ఏం తప్పా? బాబూరావుదగ్గర నోట్సు చూస్తే—?'

'అబ్బే తప్పులేదు. మీ యిల్లు అతనిల్లు ఓదగ్గరేకదూ. అంచాతే మీ యిద్దరికీ అంత చనువు.'

'అది కాకపోయినా బాబూరావు మాకు బంధువు కూడాను. వస్తాను లలితా!' అని రాధ యింట్లోకి పారిపోయింది.

రాధకు పెళ్లి ప్రయత్నాలు చేస్తున్నారు. పెళ్లికొడుకు B. A. పాసయి మదరాసులో Law చదువు తున్నాడు. రాధక్కూడా యీ సంబంధ మిష్టమే.

బాబూరావు రాధను బాగా ప్రేమించాడు. రాధమాత్ర మితణ్ణి సోదరుడికి మల్లే చూసేది. రాధక్కూడా ప్రేమ కలిగేలా చేసి యిరువురూ వివాహమాడాలని బాబూరా వుద్దేశం.

ఆవేళ సాయంత్రం బాబూరావొక్కడే పచారుచేస్తున్నాడు హాల్లో. అప్పుడు రాధ చేత్తో ఏదో పుస్తకం పట్టుకుని స్వరున లోనికొచ్చింది. 'ఓహో! పెళ్లికూతురు!' అంటూ బాబూరావు రాధతో లోపలికెళ్లి తనగదిలో కూర్చున్నాడు. రాధ బాబూరావు వేపు ప్రశ్నార్థకంగా చూస్తోంది.

'రాధా! నీకు పెళ్లిలా వుందే?'

'ఎవరన్నారు?'

'ఎవరేనా అంటారు. నువ్వనకపోతే వుండిపోతుందా?'

'ఔను—' సిగ్గుపడుతుంది.

'రాధా! మనం చిన్నప్పటినుండి ప్రేమించుకో లేదూ?'

'ఔను ప్రేమించుకున్నాం—!'

'అయితే నువ్వు మరొకర్ని ఎలా వివాహమాడుతున్నావు?'

'అప్పటి మన ప్రేమ 'సోదరప్రేమ'. అలాంటప్పుడు వివాహానికవకాశం యేదీ?'

'నువ్విలాంటావనుకోలేదు రాధా! అయితే మన ప్రేమ భగ్నప్రేమే?'

'భగ్నప్రేమ ఎప్పటికీ కాదు—ఎప్పటికీ శిథిలముండని సోదరప్రేమ! నేనేం చేసేది బాబూరావూ! వస్తాను మళ్లీ!'

అని రాధ యివతల కొచ్చేసింది.



చంద్రమోహన్ రాధకు వివాహం జరిగించేడు. రాధ భర్త మదరాసులో Law చదువుతున్నాడు. పేరు మురళీధర్. రాధను అతి గారాబంగా చూస్తున్నాడు.

ఇంతలో వేసంగి శలవులొచ్చాయి. మురళీధర్ అత్తవారింటికొచ్చాడు. రాధా మురళీధరులు ఓనాడు సాయంత్రం బీచికొచ్చారు. అక్కడ నీటివడ్డున వున్న చిన్న పడవలమీద యీ ప్రేమదంపతులు కూచుని యిష్టాలాపాలాడుకుంటున్నారు. ఒకరిద్దరు తప్ప బీచిలో యిప్పుడాట్టే జనం లేరు. దూరంగా పౌర్ణమీ చంద్రుడు వీరి విలాసానికి నవ్వుతున్నాడు. కొద్దిదూరంలో ఓ పెఱ్ఱివాడు కూడా నవ్వుకుంటూ బీచిలో తిరుగుతున్నాడిటూ అటూ, మధ్య మధ్య ఏవో మాటలంటున్నాడు పైకి. యీ వెఱ్ఱివాణ్ణి చూడగానే ఓసారి రాధమాత్రం గతుక్కుమంది. మరెవడూ కాడీ వెఱ్ఱివాడు—! బాబూరావు!!

---

# అహల్యాబాయి

"కృష్ణ"

"ఉదితోత్సాహముతోడ నేలగలరీయుర్విఁ బ్రతిష్ఠించుచో"—నిజమే. ముదితలు నేర్వఁగ రాని విద్యయేది? అహల్యాబాయి జీవితగాథయే యిందులకు సరియగు నుపమానము.

అహల్యాబాయి మలహరిరావు హోల్కారుకోడలు. ఈ మలహరిరావు హోల్కారు మహారాష్ట్ర సామ్రాజ్య సంస్థాపనమునకుఁబాటుపడిన గొప్ప సేనానాయకుఁడు. అతని కుమారుఁడు కండేరావు పానిపట్టు యుద్ధమునకుముందే మరణించి యుండెను. అందుచే నతని మరణానంతర మతని మనుమఁడగు మల్లీరావు సింహాసన మధిష్ఠించెను. మల్లీరావు కడు దుర్మార్గుఁడు. అతడుకూడ రాజ్యమునకు వచ్చిన తొమ్మిది నెలలకే పరలోకయాత్రజేసెను.

ఇఁక రాజ్యమునకురాగల రాజపురుషు లెవ్వరా అను చిక్కు సంభవించినది. మంత్రులు కొందఱు అహల్యాబాయి పరిపాలనమున కసమర్థురాలని తలచిరి. మతాచారములం దామెకుండిన భక్తి ప్రతిపత్తు లందులకు కారణమేమొ? పీష్వా రఘునాథరావుకూడ నట్లే యెంచెను. వేఱొకని రాజ్యపరిపాలనకు నియమింప వారు గడఁగిరి. కాని నిదురించుచుండిన అగ్నిపర్వత మొక్కమారు చెలరేగినది! రాజ్యమునకు హక్కు తనదేయనియు, కయ్యమగునేని వెనుదీయననియు, గౌరవరక్షణార్థమేని మరలి పొమ్మనియు పీష్వాకు అహల్య సందేశమంపెను. రఘునాథరావుకూడ యుద్ధ సన్నద్ధుఁడైనను మర్యాద దక్కదను భయముచే తన రాష్ట్రమునకు మరలెను.

ఆ 'సమయము' ఇందూరులో (హోల్కారు రాష్ట్రమునకిది పేరు) నొక నూతన శకమునకు నాంది జెప్పినదని యనవలసినదే. అహల్య పరిపాలనకు గడంగిన కొలది దినములలోననే తన యసమాన ప్రతిభావిశేషము వెల్లడిజేసినది. మహాశూరుఁడు, గుణవంతుఁడు నగు తుకోజీ అనువాని సేనానిగా నియమించినది. తుకోజీ స్వామిభక్తి యద్వితీయము. అతనికి అహల్యాబాయి మాతృస్వరూపిణి.

అహల్యాబాయి ధైర్య సాహసములు అసాధారణములు. కాని అన్యరాజ్య యన్యాయాక్రమణ మామెమతముకాదు. ఐన శత్రుకృత తిరస్కారము సహింపనోపని స్వభావ. తన రాజ్యములో అల్లరిని పురికొల్పిన ఉదయపురరాణాతో యుద్ధ మొనరించి బుద్ధిచెప్పిపంపినదే యిందులకు దృష్టాంతము.

మరియు నా యువిద యెక్కువ రాజనీతిజ్ఞురాలు. మహారాష్ట్ర నాయకులనేకాక, నైజాము టిప్పులనుకూడ ఎత్తిరాకుండ కట్టుదిట్టములుచేసి యుంచినది. ఇఁక స్వరాష్ట్రములో నల్లరులను మాటయేలేదు.

అహల్యాబాయి పరిపాలనా విధానము గొప్ప రాజకీయవేత్తలగూడ నబ్బురపరచినది. ఆమె యొక ప్రణాళిక ననుసరించి జీవితము సాగించుచుండెడిది. ప్రాతఃకాలముననే మేల్కొని సద్గ్రంథ పఠనమునకు గడఁగెడిది. తరువాత భిక్షాదానము జేసెడిది. వెంటనే రాచకార్యములకు నడుముకట్టును. ప్రజాహిత కార్యనిర్వహణమనిన నామెకు మిక్కిలి యిష్టము. బాటలు వేయించినది. దేవస్థల, సత్రముల గట్టించినది. సర్వప్రాణిలోకముయెడ నామెకు గల ప్రేమ యపారము.

అహల్యాదేవి యౌదార్యము వల, జాతి వివక్షత నెఱుగనిది. "హిందువులతోఁగలిసి మహమ్మదీయులుకూడ నామె దీర్ఘాయురారోగ్యములకై ప్రార్థనలు సల్పుచుండి"రని యొక చరిత్రకారుఁడు వ్రాసి యున్నాడు.

ఇట్టి సతీ తిలకముగూర్చి కొన్ని కథలుకూడ కలవు. ఒకప్పుడొక సాహుకారు చనిపోగా నతని ఆస్తికి వారసులులేరైరి. అందుచే నతనిభార్య యొక బాలుని దత్తుతీసికొన యత్నించెను. కాని రాష్ట్రోద్యోగులామెతో 'కొంత ద్రవ్యమొసఁగినగాని యందులకు సమ్మతింప'మనిరి. అహల్య యా సంగతి దెలిసి కొని యుద్యోగుల మందలించి దత్తునకు సమ్మతి నొసఁగెను. అప్పుడు ధనవంతుని భార్య రాణిగారి న్యాయ పరిపాలన వేనోళ్ళబొగడి గృహమునకు జనెను.

అహల్యాబాయి యంత యందగత్తెకాదు. కాని ఆమె వదనమెప్పుడు దివ్యప్రభాభాసితమే. ఆమె జీవితమున నాడంబరమనునది అబద్ధము. పొగడికలు అనిన నామెకు బొత్తిగా గిట్టదు; వినయము పెట్టని సొమ్ము. స్వార్థమున కా లేమ హృదయవీధిలో చోటులేదు. స్వంత ఆదాయమగు నాలుగులక్షల ధనము కూడా ఆమె ప్రజోపకారమునకై వినియోగించుచుండెను.

కాని అహల్యాబాయి మాతృహృదయము పలువెతలుజెందినది. కూతురగు ముక్తాబాయి-పతినుత విహీన-సహగమన మొనరించుట నామె కండ్లతో చూడవలసివచ్చినది. ఆ కోమలి దుఃఖ తాపముచే కలగిపోయినది... చేయునది లేక తుదకొక స్మారక చిహ్నముచే గతించినవారియెడ తనకుగల నిష్కళంక ప్రేమను జాటినది,

తన యఱువదియవ యేట ఆమెకూడ ప్రజల నగాధ దుఃఖమున ద్రోసి భౌతిక కాయమును వీడినది. ఆమె గతించిన రెండేండ్లలోపలనే ఇందూరు రాజ్యము అల్ల కల్లోలముల పాలైనది. ఆమె యొక్క అప్రతిహత రాజ్యపరిపాలనా దక్షత కిదియే ప్రబల నిదర్శనము.

దుష్ట శిక్షణము, శిష్టరక్షణము ఆమెచేతి కంకణములు. ఇప్పటికి ఇందూరులో అహల్య నవతారముగా నెంచుట అందుకే కాఁబోలు! ముదితల కామె జీవితము మేలుబంతి.

అంతియకాదు. అహల్యాబాయి పునీత చారిత్రము ప్రతిధ్వనించుచున్న వామె నిర్మించిన ఇందూరు నగరపు రాజవీధులు! ఆ దేవి కీర్తి సౌరభములు వెదజల్లుచున్నవచ్చటి కుసుమ సుందరులు!! ఆ సాధ్వి బంగారు నామములకు పొంగుచున్నవచ్చటి ప్రజల హృదయములు!!!

# అహింసా సిద్ధాంతం యీనాటిది కాదు

శ్రీ గ్రంధి అప్పారావు

బౌద్ధకాలపునాటి అహింసావృక్షం పుష్పించింది. అశోకునికాలంనాటి కది ఫలించి ఎండి మోడయింది. కొన్ని శతాబ్దాలు గడిచేయి. ఈనాడు మహాత్ముడా మోడుకు దోహదం చేస్తున్నాడు. చిగురుస్తుంది. ఫలించడం ఎప్పటికో?

పాశ్చాత్యదేశాల్లో ప్రేమ, భక్తి, వాత్సల్యం మొదలయినవన్నీ మంట గలిసేయి. సుఖానుభూతి, ద్రవ్యోపాసన, వీటికితోడు సామ్రాజ్యతృష్ణ కలిసి మరఫిరంగులు మొదలయిన మారణ యంత్రాలద్వారా రోజు ఒక్కంటికి కొన్నిలక్షల జీవాలను బలిగొంటున్నాయి. అమాయకప్రజల అసువుల్నికూడ తీస్తున్నాయి. ఎక్కడచూచిన శ్మశానవాటికలే, మాంసపంకారుణవారి ప్రవాహాలే. ఈమారణయంత్రాల ఘోషలో మృత్యుదేవత తాండవమాడుతోంది. ఆయమ పాదతాడనకు భూగోళం జర్ఝరితమౌతోంది. ప్రకృతిశాస్త్ర విజ్ఞానసముపార్జనకు ఫలితమా యిది?

'మతినవమానింపగాదనిన' అన్నట్టు యితరుల మనసుకు ఇంచుక కష్టం కలుగజేసినాసరే హింసలోనే చేరుతుంది. కాబట్టి హింసఅంటే ఒక్క ప్రాణాల్నితీయడమే కాదన్నమాట. ఒకని మనసు లవలేశం నొప్పించడానికి నీకు హక్కులేదుగదా దౌర్జన్యానికిగాని, హత్యలకిగాని నీకు అధికారం ఏముంది?-తిండికిలేకపోతే మలమలమాడి చావు. పరుల్నిమాత్రం హింసించకు.

'పరహింస, పరభామాన్యధన, పరమానవాపవాద, పరజీవనముల కన్నృతమే భాషించె రయ...' అని 'శృంగార రసాద్యఖిలసారపూరిత రామకథానందాబ్ధియుత సంగీతశాస్త్రజ్ఞానం'చేత శ్రీరాముణ్ణి భక్తిబంధాల్తో యింకే కట్టేసుకున్న శ్రీ త్యాగరాజువారు గానంచేస్తూ, పరుల్ని ఏవిధంగాగాని హింసించడం కూడదన్నారు.

'ఒకనికి కీడు ప్రత్యక్షంగా చేయుటకన్న అట్టి కీడు తలచుటే ఎక్కువ పాపకర'మన్నారు. ఋషీశ్వరులు, యోగులు, పండిత ప్రకాండులు, భక్తులు, సాధువులు యీ యహింసా సిద్ధాంతాన్ని కొనియాడేరు. హృదయంవున్న ప్రతి మానవుడు ఈ యహింసాదేవతకు స్వాగతం యిస్తాడు.

## బుద్ధుడు

గౌతమ చక్రవర్తి (బుద్ధుడు) హృదయం నవనీతంలాంటిది. శవాల్ని, రోగుల్ని, నడవలేక నడవలేక నడుస్తూండే ముసలివాళ్లని చూచినప్పుడాతని హృదయం నీరయేది. ఈలాంటి కష్టాలు బాధలు లేకుండా చేసుకొనే మార్గం ఏదన్నా వుందేమోనని ఎప్పుడూ ఆలోచిస్తూండేవాడు. రాజ్యాలు, భోగాలు త్యజించేడు. దారసుతాదుల్ని విడిచిపెట్టేడు. అడవుల పట్టేడు. గొప్పతపస్సు చేసాడు. అష్టకష్టాలు పడ్డాడు. అనందమయజీవితానికి మూలసూత్రమేదో కనిపెట్టాడు, చివరికి గయలోవున్న ఆ వట వృక్షంక్రింద. ఇదే 'అహింసా సిద్ధాంతం'. ఇందులోనే వెలలేని ఆనందం వుందన్నాడు. మానవుడు పవిత్రమయిన మానవశబ్దానికి అర్హుడు కావాలంటే దీన్ని పాటించమన్నాడు. నరపశువులు కావద్దన్నాడు. తన సందేశాన్ని దేశదేశాలవాళ్లకి తన శిష్యకోటిద్వారా అందజేశాడు బుద్ధిమంతుడు - బుద్ధనామార్హుడు.

## అశోకుడు

అశోకుడు శైశవంలో తన యింటిదగ్గర పాఠాలుచెప్పే పంతుల్ని యుద్ధాల్నిగురించిన కథలు చెప్పమని వేపించుకు తినేవాడు. తానుకూడా యుద్ధంచేసి, తండ్రి తాతలకంటె ఎక్కువ యశస్సు సంపాదించాలనుకునేవాడు. సైన్యం నడుపుతూన్నట్టు, కత్తి త్రిప్పుతున్నట్టు కలలు కంటూండేవాడు. అతనికి అహర్నిశలు

అదే ధ్యానం—యుద్ధం తప్ప యింకోవాంఛలేదతనికి. తన వాంఛ ఎప్పుడు సఫలమౌతుందో అని ఉవ్విళ్లూరుతుండేవాడు.

అతనికి యిరవై సంవత్సరాలొచ్చేక తండ్రి మరణించాడు. ఇన్నాళ్లనుండి అణచిపెట్టబడివున్న అతని సమరోత్సాహం ఒకేసారి ఉవ్వెత్తుగా పొంగిపొరిలింది. పెద్దసైన్యంతో కళింగదేశంమీదికి దండయాత్ర సాగించాడు. గ్రీకుల్ని (Greeks) పారద్రోలడానికి తీవ్రమయిన యుద్ధం జరిగింది. అతని శరాగ్నికి గ్రీకులు శలభాల్లా శరణార్థులై పారిపోయారు. తన తండ్రితాతలుకూడ ఎరుగని దిగ్విజయం కలిగిందీనాడు యీతనికి.

అశ్వారూఢుడై అశోకుడు యుద్ధరంగంనుండి తన గుడారానికి వస్తున్నాడు. సాయంత్రమయింది. వస్తూవస్తూ గుర్రాన్ని చటుక్కున ఆపేశాడు. తన చుట్టూవున్న ప్రదేశాన్ని తదేకదృష్టితో చూస్తున్నాడు. రణరంగంలో స్వైరవిహారంచేసిన ఆ యోధుని వదనపద్మం ఎందుకోగాని ముకుళించింది. చుట్టూ చూస్తున్నాడు. ఆ ప్రదేశం అంతా రక్తమయం. కరచరణాద్యవయవాలు తెగిన మనుష్యులా యిరుణవారిలో పొర్లాడుతున్నారు. మూలుగుతున్నారు. వాని గుండె తటపటాయించింది. దీనికంతకు కారణం తనే అనుకున్నాడు. చిరుచీకట్లు కమ్ముతున్నాయి. దూరాన్ని నక్కలు కూతలేస్తున్నాయి. ఆ కూతలలో నిండుసంబరం ద్యోతకమయింది. 'రాజ్యకాంక్షకు పర్యవసానమిది' అని ఏదో ప్రతిధ్వని వాని శ్రోత్రేంద్రియానికి తగిలింది. రెండు వేడి కన్నీటిబిందువులు రాల్చేశాడు. ఆ యుత్తరక్షణాన్నే అతనిలో ఒక గొప్పమార్పు కలిగింది. రాజ్యాన్ని సంరక్షించుకోడానికి తప్ప కత్తిముట్టనని ఆతడొక ఘనమయిన శపథంపట్టేడు.

## మహాత్ముడు

ఈనాడు గాంధీ మహాత్ముడు శాంతి సముపార్జనకి నిర్నిద్రదీక్షతో నడుముకట్టి ప్రయత్నం సల్పుతున్నాడు. అహింసాధర్మాన్ని వేనోళ్ల చాటుతున్నాడు—ఈ సిద్ధాంతం క్రొత్తదికాదు. మొదట బుద్ధుడు ప్రచారంచేసాడు. తరువాత అశోకుడు. ఇప్పటికి కొన్నివందల సంవత్సరాలు గడిచేయి. ఇప్పుడు మహాత్ముడు దీనితత్వాన్ని ప్రపంచానికి బోధిస్తున్నాడు. ఒకనికి ప్రాణంపోసేశక్తి నీకు లేనప్పుడు, ఒకని ప్రాణం తీసే హక్కుమాత్రం నీకేముంది? అంటాడు. శాంతిస్థాపనచేసి భూలోకాన్ని బృందావనంగా చేయాలంటాడు. ఈ విశాలవిశ్వం అంతా ఒకయిల్లు. మానవులంతా ఆ యింటివారు అంటాడు. ఇదే విశ్వమానవసౌభ్రాతృత్వం. లోకకల్యాణానికి పచ్చతోరణాలు కట్టాలంటే యిదే మార్గం అంటాడు. తన సందేశాన్ని లోకం అంతటికి అందజేసాడు. అన్ని జాతులవారు తలలూపేరు—

ఎందరో మహనీయులీ సిద్ధాంతాన్ని కొనియాడుతారే! తులసిదళాల్తో పూజిస్తారే! పాశ్చాత్యదేశాల్లో, రోజు ఒక్కంటికి వేలకివేలు బుర్రలు తెగిపోతున్నవే! అయ్యయ్యో! ఒకరిప్రాణాలొకరు తీసుకుంటున్నారే! వాళ్ళకి హృదయాలు లేవూ? దయ, జాలి, కనికరం లేదూ? కుక్కపిల్ల మూలుగుతోంటే గుండె నీరయిపోతుందే! పీకలు తీయడం మానవులుచేసే పనేనా?

ప్రస్తుతం పశుబలం ప్రబలంగా వున్నప్పటికీ—చివరికిమాత్రం—

మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటె నిలచి వెలుగును
అంత, స్వర్గసుఖంబులన్నవి
అవని విలసిల్లున్.

---

# ప్రపంచమున స్త్రీకి గల గౌరవము

★ శ్రీమతి శనివారపు అన్నపూర్ణాదేవి ★

అజునితలఁపున పురుషుఁడే యగును మొదట!
తోడ యోచించె లెస్సగా స్త్రీల మాట!!
అది స్ఫురణకు నన్యంబు లధికమాట
తథ్య మిరువుర స్త్రీలె యత్యధికు లకట!!

నవ్యనాగరికతా వ్యాప్తిగల ప్రదేశముల స్త్రీ యత్యంత గౌరవమున పూరుషాళిచే బహూకరింపఁబడుచున్నది. కొలఁది నాగరికదేశములం దామె సమానత్వము నిరాకరింపఁబడలేదు. కాని, నాగరికతయే కొఱవడిన పు[illegible]ం దామె అధఃపాతాళమున కుంగి, క్రుళ్లుచున్నది. హిందూదేశపు నిరక్షరాస్యులగు కూలి జనములు తమ భార్యల ననేక ఘాతుకకృత్యములు చేసి, స్త్రీలను తమ బాహ్యేంద్రియ సౌఖ్యమును జేకూర్చు ఊడ్పుకత్తెలగా దలంచుచున్నారు. స్త్రీ జీవితమంతయు పురుషునికై వినియోగించుటే ఆమె జీవితపరమావధి యని కూడ తలపోయుచున్నారు. విద్యావంతుఁడును, మేధావియునైన, క్రమవర్తను డెవ్వఁడేని సందేహింపకయే, స్త్రీకి పురుషునితో సమానహక్కును ప్రకటించుట యెంతయో యోగ్యమైనది.

అడ్డాలలోని బిడ్డడే తుదకసంతవిశ్వము నేలగలవాడనుట అందఱకు ఆమోదమే యగును. కాని, స్త్రీయే విద్యావిహీనయైన అదెట్లు సాధ్యమగును? స్త్రీని నిరసించి, ఆమెకు విద్యాదానము చేయక యుపేక్ష చేసిన, గృహాలంకరణాది ప్రధాన బాధ్యతలఁ దలగొన నసమర్థురాలగుచున్నది. ఇది యెఱిఁగియు నామెను విద్యలేని వింతపశువుగ జేయుట యెంతయో కొఱగాని పని. నిక్కముగ స్త్రీ ప్రేమాతిశయమున కాస్పదము. దినమందలి విశేషభాగము గృహము వీడియుండు తండ్రికన్నను, తమ సుఖదుఃఖముల జూచుచు తమకు సంతోషాదరముల ప్రసాదించు తల్లియే పిల్లలకు ప్రధానము. బాలానందమంతయు తల్లిదే. అందుచేతనే మాత పరమమిత్రురాలగుచున్నది. తల్లియందే సుఖదుఃఖముల నాదరింపగల శక్తి యిమిడియున్నది. ఇతరుల కలవి కాని యీ యాదరణ తల్లికే ప్రత్యేకింపఁబడినది. ఆమె బిడ్డను జేతులఁ లాగి, హృదయమున కాదుకొనును. ఆమె కర్ణములకా జిలిబిలి పలుకులే ఆనందము గూర్చును. ప్రపంచమందలి మేలిమంతయు మాతృప్రేమ కెనయగుట దుర్లభము. మాతాశిశువుల అవినాభావసంబంధ మెంత గాఢమైనది! ఎంత పవిత్రమైనది!

ఒక సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత స్త్రీ విద్యను ప్రశంసించుచు 'ఒక పిల్లవాడికి విద్యగరపిన, ఒక్క వ్యక్తియే విద్యావంతుఁడగును; ఒకేపిల్లకు విద్యనేర్పిన వంశమంతట విద్య శోభిల్లును' అనెను. దీని యదార్థత నెందఱో చాలవరకు గ్రహింపగల్గిరి. అందు విద్యావంతులు తమ పిల్లలకు తామే విద్యాభ్యాసము చేయ దొడంగిరి. ఇది స్త్రీవిద్యాప్రబోధకుల కెంతయో సంతసింపవలసిన ఘట్టము.

ఇఁక స్త్రీలే విద్యాభ్యాసమునకు దొరకొనిన యింకెన్నియో కీడులు వాటిల్లు ననువారి భావముల ద్రోసి పుచ్చుటయు సమంజసము కానేరదు. ఆమె "గూటిపిచుకవలె, సదా గృహమునే ప్రపంచముగా దలంపదు; పతిని సహితము అరికట్ట యత్నించును." ఈ తలఁపులెంతయు సహజముగనే యున్నవి. కాని

చిరకాలమునుండి మగవాని యధికారమునకు లొంగి, క్రుంగిన యాడువారి కీనాడు యెగుర రెక్కలు కలిగిన స్వతంత్రతతో కొలది కాలమైనను మెలఁగుటకు స్వేచ్ఛగైకొన్న అందేమియు దోషము గానరాదు. సర్వ కాలములందీ పరిస్థితులే నడచుననియు నమ్మజాలము. అచిరకాలముననే తనకు సర్వోత్తమమైన స్థానము పతి సామీప్యముననే, పతి గృహముననే కలదని గ్రహింపకమానదు.

స్త్రీ స్వతంత్రముగ విహరించి, బహిరంగ సభలకేగుటవలనను, పురుషాధిక్యత గల విద్యాలయములఁ బఠించుటచేతను ఆమె ఆత్మగౌరవమును, పాతివ్రత్యమును గోలుపోవునేమో యను భీతి చెందుట వలనుపడదు. ఈ సంఘటనలే ఆమె పవిత్రశీలమును ధృడపఱచఁగలవు. తన మహత్తర ఆశయముల విడనాడక, మానావ మానములను స్వయముగ సంరక్షించుకొని, ఆదర్శముగ మెలఁగి మగవారి మన్ననలను బడయును. తండ్రి, భర్త, సోదరుడు, పుత్రుఁడు కాపాడఁజాలని యాపదలన్నింటిని తానే తొలగించుకొనును.

డీక్వెన్సీ వచించినట్లు "పదిమంది యాడువారిలో యువకుడొకడు మెలకువతో చరించుటకన్నను, సులభముగ నొక స్త్రీ పదుగుర యువకులలో కడునేర్పరియై తన్నుదా రక్షించుకొనఁగలదు" ఈ యభిప్రాయ మును యువకులు సాదరమున మన్నించెదరుగాక!

"If a woman laughs, laugh with her;
If a woman weeps, weep with her;
If a woman speaks, speak with her;
If a woman is silent,—Beware!"

---

# భరతమాత

అదియె దేవరథంబు యల్లదియె గదవె,
వచ్చి యున్నయది మిగుల వేగముననె,
ఇపుడు మన సుభోదయవేళ నింక నెక్క
డయ్యె! స్వతంత్రవని నిక డాయవలయు.

భారతీయోద్యమం బను బండు విచ్చె,
భరతపుత్రులు నేడెందు వీగిపోరు,
భారతి యౌన్నత్యంబిక బలమునొందె
భరతమాత! యిల నిశ్చింత వగుదువమ్మ!!

గాంధి, పటేలు, జవహారుల కాదిమాత!
యజదు పట్టాభివంటి తనయుల బడసిన
భరతమాత! నీ కింక కొదువవచట? తగ
దు కనుగవ నీరు కర్జంబు దరుగుగాదు.

చంటిపాల్గుడిచి యిల నీ చంకబెరిగి
వంటిశక్తుల నీకై య్యె విడతురమ్మ!
పంటలను దోచుచుండిరి పాలకులును,
పంపగదవమ్మ పోర దీవించి తల్లి!!!

—పొన్నపల్లి కృష్ణమూర్తి బి.యె.

# పల్లె పదాలూ – స్త్రీల పాటలూ

శ్రీ కొత్తపల్లి రంగారావు



ఈ క్రింది పదాల్లో మాతృభక్తి వ్యక్తం అవుతుంది.

ఆలిచస్తే ఆలి
కద్దయ్యా రాజా!
తల్లిచస్తే తల్లి
ఏదయ్యా రాజా?

కండకావరాన
మదమత్సరాన
కన్నతల్లీమీద
కాలెత్తు నొకడు.

స్త్రీ హృదయానికి భయానకములైనవీ, జుగుప్సావహములైనవీ, అవమానకరములైనవీ రెండే రెండు విషయాలు గలవు. అవి 'గొడ్రాలు బ్రతుకు' 'సవతిపోరు'. వాటిని యెంత హృదయంగమంగానూ, పారమ్యాన్ని జెందేట్లు వర్ణించారో చూడండి!

గొడ్రాలు బ్రతుకేల కోటి ధనమేల?
స్వారాజ్యమిచ్చినా సవతిపోరేల?

ప్రాత చింతాపండు గోనెల్ల చీకు
గొడ్రాలు గుడ్డల్లు పెట్టెల్ల చీకు.

దియ్యలేనీ వారిల్లు దెయ్యాలకొట్టు
సంతులేనీ వారిల్లు జంగాల మఠము.

సంబారు లేని కూర సౌఖ్యమ్ములేదు
ఆలిమీదా పెళ్లి అందమే లేదు.

గొడ్డురాలీ జోలి పోకురా బసవ!
గొడ్డురాలీ తిట్టు గొడ్డటిపెట్టు!

కన్యలకు స్వాతంత్ర్యంలేని భారతీయ సమాజంలో 'వరాన్వేషణ' తల్లిదండ్రులకు పెద్ద సమస్యయై విడదీయరానిదై వారిమీదనే కన్యల బ్రతుకంతా ఆధారపడి ఉంది. అట్టి వరాన్వేషణలకు చక్కని సలహా, ఉపమానాలు, దృష్టాంతాలతో సహా యీ క్రింది పదాల్లో పొందుపఱచబడి ఉంది.

కూరలోనీ గడ్డి
ఏర పనిలేదు
కూతునియ్యకముందె
గుణమెంచవలెను.

కాకరగాయమీద
గంటులున్నాయి,
కలవారికి స్తేను
గాతలున్నాయి.

(ఇందలి భావం వ్యంగ్యం:)
మెదగని బియ్యాన
అన్నమెక్కడిది?

మేదకుడీ చెట్టడితె
మెఱుపు లెక్కడివి?

దంచనీ బియ్యాన
అన్నమెక్కడిది?
దరిద్రుడీ చెట్టడితె
ధనము లెక్కడివి?

మేడికాయకీనేల?
మెడగోయ్యనేల?
కానివాడికీనేల?
కంట తడియేల?

స్త్రీకి మనదేశంలో వారసత్వం లేకుండా జేశారు. పైగా కన్యాశుల్కాన్ని దీసికొని కన్యలను బానిసలవలెను, కాదుకాదు—మాంసపిండాలవలెనూ అనర్థాలకు విక్రయించడంకూడా వచ్చింది. దానికి ఏమీచేయలేని అమాయిక స్త్రీ హృదయం ఇల్లా పాడుకొంటుంది,—

కాయనీ పూయనీ వృక్షమ్మలేల?
కలిముంటె పెట్టనీ కన్నవారేల?

స్త్రీకి పై బానిసతనం ఎప్పుడు పోతుందో, ఆర్థికస్వాతంత్ర్య మెప్పుడు వస్తుందో! అప్పుడే యీ అత్తాకోడళ్ల సమస్యకూడా పరిష్కృతం అవుతుంది.

కోడలా! రమ్మంటె కోపమెందులకు?
కొంగుమాడ లోసి కొన్న కోడలకు.

అత్త చచ్చిపోయె అగ్గిపిడిగొట్టి
నిత్తెమని చెప్పరే క్రొత్త కోడలకు.

ఊరిముందరి చింత ఉగ్రపూ చింత
ఊరిలోనీ కోడండ్ర ఉరిదీసే చింత.

(ఇవన్నీ మా నాయనమ్మ పాడినవే) (సశేషము)

# హైందవాచారాలలో విజ్ఞానం

పూజ 

● వసంత ●

అయితే మనం సమకూర్చుకొను సామగ్రి మన ఎదిరి స్వభావంబట్టి శక్తిబట్టి ఉంటుంది. మనం చేస్తున్న నిత్యసంగ్రామం ప్రకృతి శక్తులతో. చాలవరకవి అదృశ్యమైనవి. వాటితో పోరుసల్పి వాటిని జయించడానికి కత్తి, కత్తి, తుపాకి, ఫిరంగి, బాంబరు, టార్పెడోలు అక్కరకురావు. సజాతీయమైన శక్తినే మనం పెంపొందించాలి.

ప్రకృతి శక్తులు, భౌతికశక్తులు అంటే భౌతిక సంబంధమైనవే అని ఊహించరాదు. ఫిరంగిలో మందుపోసి ముట్టించగా, మందు భస్మమై అధికమైనశక్తి ఉత్పన్నమౌతుంది. కాని ఆశక్తితో ప్రకృతి శక్తులను ప్రతిఘటించడానికి సాధ్యంగాదు. జీవాన్ని భస్మం చేయడానికి, కట్టడాలని భూమట్టం చేయడానికి, కొండలను పిండిచేయడానికి ఆశక్తి ఉపకరిస్తుంది. మానవ సౌఖ్యం శతాధికం పెంపొందించడానికి ఉపయోగపడుతుంది. కాని ఉత్తమ జీవితాశయాలకై శ్రమించు జీవులకు అంతగా ఉపకరించునట్లు తోచదు.

మానవు డొక సంకుల శక్తి సమన్విత క్షేత్రంలో జీవితం గడుపుచున్నాడని గుర్తించేము. అట్టి క్షేత్రంలో మానవుడుగాక అన్యమైన జీవులు, వస్తువులుకూడ ఉన్నాయి. కాని, భౌతికనియమాల నుల్లంఘించి స్వతంత్రంగా ప్రవర్తించగల విశేషసామర్థ్యం మానవునికొక్కనికే ఉంది. పంచదార నీటిలో కరగుతుంది; పైకి విసిరినరాయి క్రింద పడుతుంది; నీటిని తగినంత వేడిచేస్తే మఱుగుతుంది. ఆయాపదార్థాలు ప్రవర్తిస్తాయి. అయస్కాంతక్షేత్రంలో ఇనుపముక్కనుంచితే దానికి అయస్కాంతత్వం ప్రాప్తిస్తుంది. ఇనుపముక్కలోని అణువులు అయస్కాంతబలానికి లొంగి క్రమంగా సర్దుకొంటాయి. కాని మానవుడట్లు కాదు.

క్రియకి ప్రతిక్రియ, దెబ్బకి మారుదెబ్బ—ఇవి ప్రకృతి లక్షణాలు. నియతబలాధీనమైన ఒకవస్తువు ఎట్లు ప్రవర్తిస్తుందో చెప్పుటకు సాధ్యమౌతుంది. భౌతికనియమానుసారంగా ఒకేఫలితం సిద్ధిస్తుందని చెప్పవచ్చును. కొంతవేగంతో ఒక వస్తువును సూటిగా పైకి విసిరినప్పుడు అది పైకిపోయి భూమ్యాకర్షణచేత క్రిందపడుతుంది. ఆపతనంలో బయలుదేరిన స్థానం చేరుకొనుసరికి బయలుదేరిన వేగమే సంపాదిస్తుంది. అన్యబలాధీనమైయుండనంతకాలం ఆ వస్తువుయొక్క ప్రవర్తన నిశ్చయంగా చెప్పకొనవచ్చును.

అంతేకాక ప్రతివస్తువుకి 'జడత్వం'అను ఒక లక్షణం ఉంది. అది ద్రవ్యలక్షణమని చెప్పవచ్చును. స్థిరంగానున్న వస్తువు స్థిరంగానే ఉంటుంది. చలనంలోనున్నది నియతవేగంలో సూటిగా పోతూనే ఉంటుంది. ఉన్నస్థితిని మార్చుకొనుటకెట్టి వాంఛనీలేకుండుటే జడత్వం. ద్రవ్యనిర్మితమైన మానవునికీ జడత్వ లక్షణం ఉంది. కాని ద్రవ్యంతో చైతన్యంచేరిన విశేషయోగం మానవుడు. చైతన్యం జడత్వాన్ని సంహరిస్తుంది. జీవంయొక్క ప్రధానలక్షణమే చలనం. కాబట్టి, మానవుడు జడపదార్థంవలె భౌతిక నియమానుసారంగా బాహ్యశక్తుల ప్రవృత్తికి లొంగవలసినవాడుకాడు. మానవునికి మనస్సు, బుద్ధి, వివేకం ఉన్నాయి. వాటి సాహాయ్యంతో మానవుడు జీవకోటిలో ప్రధానస్థానం, అత్యున్నతస్థానం వహించేడు. మానవోత్కర్షకు అవే మూలము.

ప్రకృతిశక్తులు మానవునిపై ప్రవృత్తిస్తున్నప్పుడేమి వాటిల్లుతూంది? మనస్సు, బుద్ధి, చైతన్యాల సంయోగంతో అహంకారం జనించింది. మానవుడహంకార పూరితుడు. వివేకంయొక్క వైరి అహంకారం. అహంకారబలం హెచ్చినప్పుడు వివేకం క్షీణిస్తుంది; యుక్తాయుక్త నిర్ణయసామర్థ్యం అడుగంటుతుంది. అవివేకంతో అరిషడ్వర్గాలు పెచ్చు పెరుగుతాయి. బాహ్యశక్తులు అట్టిస్థితిలో మానవుని అలజడి పెట్టగలవు. స్థైర్యము నైశ్చల్యములేని మానవుడు తామరాకుపై నీటి బొట్టువలె అల్లలాడి దుఃఖిస్తాడు. అసంతృప్తిచే వాపోతాడు.

కాబట్టి ప్రకృతి శక్తులకు లోబడకుండ స్వేచ్ఛగా ప్రవర్తింపదలచుకొన్న మానవుడు దృఢచిత్తుడై ఉండాలి. బుద్ధి చాంచల్యాన్ని అరికట్టాలి. వివేకపరుడై ఉండాలి. అహంకారాన్ని మట్టిపెట్టాలి. అప్పుడు ఆత్మశక్తి విజృంభించడానికి అవకాశమేర్పడుతుంది. ఆత్మశక్తియే అంతశ్శక్తి. ఆత్మశక్తి ప్రభావాని కంతు లేదు. బాహ్యశక్తులు మానవునిపై ప్రవృత్తించునపుడు జనించు వికారాలను ధ్వంసంచేయగల సామర్థ్యం ఆత్మశక్తికేఉంది. అట్టి ఆత్మశక్తిని యథేచ్ఛగా విడుదలచేయగలవానికి దుస్సాధ్యమైనది లేదని నిరూపించుటే మన పురాణేతిహాసాల కర్తవ్యం. ఆ నిరూపణ చక్కగా చేయగలిగేయి. కొన్ని పౌరాణిక విషయాలు విచారించి వాటి వైజ్ఞానిక వివక్షు కనుగొన ప్రయత్నిద్దాము.

పురాణాలు కాలక్షేపానికై చదువవలసిన గ్రంథాలుకావు. మధ్యాహ్నం నిద్రపోగొట్టుకోడానికి గాని, ఉబుసుపోకకు గాని, కాలయాపనకుగాని పురాణ కాలక్షేపంచేయడం ఆచారమయింది. అది చాల విచారకరమైన విషయం. పౌరాణిక గాథలు విని, భారతీయౌన్నత్యం గ్రహించి, ఆధ్యాత్మిక తత్త్వార్థం మననం చేసికొని, ఆత్మాభ్యుదయ కరములగు కర్మలను నిత్య మాచరించినప్పుడే పురాణ కాలక్షేపం సార్థకమౌతుంది. దైనందిన వార్తలట్లు ఒకచెవిని విని రెండవచెవిని విడిచిపెట్టవలసిన విషయాలుకావు పౌరాణిక విషయాలు. వాటి సాహాయ్యంతో అనుక్షణం తన జీవితాన్ని సంస్కరించుకోవలసిన బాధ్యత మానవునిపై నుంది. క్షణ క్షణానుభవాలని వివేకంతో సంకలనం చేసికొంటూన్న జీవితమే జీవితం. దాతృత్వం, విశాల దృష్టి, మనస్థైర్యం, భూతదయ, ఋజువర్తనం, కార్యసాధన దీక్ష మొదలగు గుణాలు అవసరమైన క్షణాన్ని పుట్టుకొనిరావు; 'గాలిచిచ్చుపై కెరలిన వేళ దప్పిగొని కీడ్పడువేళ జలంబుగోరి తత్తరమున ద్రవ్వినంగలదె దాశరథీ కరుణాపయోనిధీ' అన్నట్లు, మానవుడొనరించు ప్రతిస్వల్ప కార్యంలోను వాని శీలం, భావసరణి, ఆర్జవం స్ఫుటమౌతాయి. 'గృహీత ఇవకేశేషు మృత్యునాధర్మ మాచరేత్' అనువిషయం ప్రతిజీవి బాల్యావస్థలోనే విధిగా గుర్తించవలసింది. అట్టి సందర్భంలోనే జీవితాశయాలు ఫలించడానికి అవకాశం కలుగుతుంది.

పురాణాలలో చెప్పబడని విషయంలేదు. ప్రధానంగా ఆత్మశక్తియొక్క ప్రభావం నిరూపించడానికే అవి నిర్దేశించబడినట్లుంది. మానవునకసాధ్యమైనది లేదని ఘంటాపథంగా తెలియజేసి మానవునికి ప్రోత్సాహమిచ్చుటే వాటి ముఖ్య ప్రయోజనంగా గోచరిస్తూంది. పౌరాణిక స్త్రీ పురుషులు కల్పిత పాత్రలని కొందరిమతం. దాని నామోదించినా వాటి ప్రయోజనానికి భంగంరాదు. కొన్ని మహోన్నత భావాలకే వ్యక్తిత్వ మారోపించి, ఆ వ్యక్తులెన్ని విఘ్నాలనైనా అతిక్రమించి తుదకు కార్యం నిర్వహించుకొన్నట్లు చిత్రించేరన్నా నష్టంలేదు; వ్యక్తులతో నిమిత్తంలేదు; అందులోని ఆదేశాలే మనం గ్రహించవలసినవి.

(ఇంకా ఉంది)

# దురదృష్టవంతురాలు

మిస్ యస్. యస్. దేవి

అప్పుడు 9.30 గం|| కావస్తున్నది. సినిమా మొదటిఆట పూర్తిఅయినది. గొప్ప, బీద, చిన్న, పెద్ద, ముసలీముతుక అందరూకలసి హాయిగా సినిమా వుషారులోపడి "దేవికారాణి బాగా పాడ్తుంది. అశోక్ కుమారుడు బాగా నటిస్తాడు" అని కులాసాగా మాట్లాడుకుంటూ మెల్లిమెల్లిగా ఆచల్లని వెన్నెల్లో జట్లు జట్లుగా కలసి వెళ్లుతున్నారు.

అప్పుడే ఒక గ్రుడ్డివాడు తన వుద్యోగం మొదలెట్టాడు, ముష్టిచిప్ప చేతపుచ్చుకుని. ఆ వుద్యోగానికి వేళాపాళా అనేదేమీ లేదుగా మరి! ఆ గ్రుడ్డితనానికి తోడుగా ఒకచిన్న పిల్లకూడావుంది వెంట. మొన్న మొన్ననే పోయింది భార్యకూడాను. ఆచిన్నపిల్లే తల్లికిబదులుగా అన్నిచోట్లా విసుగులేకుండా తిప్పుతుం డేది. రాత్రిపగలూలేకుండా యిద్దరూ చెరొకటి చేత పుచ్చుకుని బయల్దేరారు. ఎవరికైనా దొరుకుతుందనే ఆశతోటి...ఆపిల్లపేరు రాధ.

"గ్రుడ్డివాణ్ణండి బాబయ్యా...
మీ పాదాలకు మొక్కుతా సామీ...
ఒక్కరాగిదమ్మిడీ వెయ్యండి బాబులూ,
మీ కడుపున పుట్టుతా బంగారపు బాబులూ..."
బాబూ...బాబూ...ఒక్కకాని!...ఒక్కకాని...
కడుపు మాడ్తున్నది చచ్చిపోతున్నాము...
వాడిఖర్మం...ఏంజేస్తాము...
వాడి గతంతే...యేడవనీ...వెధవలు...

అని అనేక కేకలు వినబడ్డాయిగాని...ఒక్కడూ ఒక్కదమ్మిడీకూడా యివ్వలేదు...కాళ్లకు అడ్డాలు పడినా ఒక్కడూ ఒక్కదమ్మిడీఅయినా యివ్వలేదు. నిన్నంతా పస్తే, యివ్వాళ్లంతా పస్తే...ఆ యిద్దరూ ఎప్పుడు ప్రాణాలు గుటుక్‌మంటాయో అనేలాగున్నారు. పోనీ తనకు లేకుంటే పిల్లకైనా ఒకపట్టెడు మెతుకులు దొరుకుతాయేమోనని ఆవూర్లోవుండే ఒకపెద్ద హోటల్‌కి వెళ్లాడు. అప్పటికప్పుడే 12 గం|| అయింది. అందరూ చాలావరకు సగంనిద్రలో వుంటారు. పాపం! ఆ చిన్నపిల్లకుకూడా నిద్రరాదు మరీ! నిద్రవచ్చి "నాన్నా! యీపూటకు లేకుంటే పోనీలే, రేపు తెచ్చుకుతిందాము. నిద్రవస్తుంది. రాలేను" అని తండ్రి ఒడిలో పడింది. తండ్రి కన్నీరుగార్చి యేమీచెయ్యలేక వూరుకున్నాడు, ఏంచేస్తాడు, ఎవరిని తిట్టాడు? ఎవరినంటాడు? ఎవరినంటె ఎవరు ఊరుకుంటారు? తనలో తానే కొంచెంసేపు సణుక్కుంటూ, గొణుక్కుంటూ నిద్రపోయాడు.

తెల్లారినది. రాధ యింకా లేవలేదు. 8 గం|| కావస్తున్నది. సూర్యుడు బలవంతంగావచ్చి కళ్లలో పొడిచి లేపుతున్నా లేవలేదు. తండ్రి యెలాగో ఒకకర్రను పట్టుకుని మెల్లిమెల్లిగావచ్చి, "లే నా బుల్లితల్లి లే నా బంగారుతల్లీలే" మని బలవంతంగా లేపాడు. రాధ వెంటనే లేచి కాలకృత్యాలన్నీ తీర్చుకుని, తండ్రి దగ్గరకొచ్చి కూర్చున్నది. "నాన్నా దేవుడు నిన్ను యీలాగు ఎందుకు పుట్టించాడు? నువ్వుచూస్తే దేవుడు చూడలేడా! పోనీ డబ్బయినా యివ్వకూడదా? పోనీ అమ్మనికూడా ఎందుకు తీసుకెళ్ళాలి?...అని యేవేవో

కూర్చుని అడగటం మొదలెట్టింది. చిన్నపిల్లయినా రాధ ఊహలకు ఆలోచనలకు మాత్రం చిన్నదికాదు. తండ్రికి అమిత దుఃఖం వచ్చి "అమ్మాయీ...నీకెందుకులే ఆ గొడవంతా, పదా, కాస్త తెచ్చుకుని తిందాం" అని ఆ మాటల్లోంచి తప్పించి మెల్లిగా యిద్దరూ బయల్దేరారు.

ఆవూళ్లో ఒకగొప్ప షాహుకారుగారువున్నారు. ఆషావుకారుగారింటికే మనరాధ గ్రుడ్డివాడు వెళ్ళారు. మళ్లీ పాడారు వాళ్లపాట గంటన్నరా...నోరుకూడా నొప్పిపెట్టింది. చివరకు ఆషావుకారు ఒక నౌకరునుపిలిచి ఒరేయ్‌సుబ్బాయ్ ఈ వెధవముష్టివాణ్ణి అవతలకినెట్టు అని అనీ అనటంతోటి ఒకరికిద్దరు వచ్చి అవతలకు నెట్టారు. గ్రుడ్డివాడుగా పాపం! ఆపక్కనేవున్న రాయిమీదపడ్డాడు. రాయి తలకు తగిలి రక్తము వరదలుగాకారి పడిపోయాడు. రాధ యేడుస్తూవచ్చి "నాన్నాలే తెచ్చుకుతిందాం...లే...నాన్నా...లే..." అని మొండెత్తి యేడ్చింది. ఎవ్వరూ పలుకరించినవాళ్లు లేరు. అటుచూచిన వాళ్లు లేరు. పాపం ఆరాధకు యేమి తెలుసూ?...అప్పుడే పోయింది ప్రాణం......పాపం! రాధయొక్క దురదృష్టము!

# ఆంధ్రమాత!

గీ. బీదవారలు నీవారు, పేదనీవు
కట్ట గుడ్డలు లేవు, తాకట్లపాలు
ఇంట సొమ్ములన్నియును, వెంటబడెడు
భీకర దరిద్రదేవతే నీకు తోడు.

గీ. ఆస్తులే లేకపోయిన, అస్తులైన
తెనుఁగు బిడ్డను బాయునే తెగువుమీఱ?
ఎండు టెముకల నంటిన దెప్పుడోను
పౌరుషంపు రక్తకణిక చేరువగను.

గీ. మాటిమాటికి యుబుకుచు, సాటిలేక
వెచ్చ కొన్నెత్తురీ హృదయ వీధులపుడె
బాసిపోలేదు రూపునమాసిపోయి
నేటికైనను, తాతలనాటిదైన.

గీ. తాతలెప్పుడో చేసిన చేతలిపుడు
మరల మరల నేటిసుతులు మఱచిపోక
తలఁచుటెందుకుఁ, జూడ, తాతలను మించు
మనుమలున్నారు, నేడాంధ్రమాత! నీకు.

—ఘండికోట బ్రహ్మాజీరావు.

# మేనరిక వివాహములు కూడును

శ్రీ మూర్తి

నేటి నవనాగరికతా ప్రపంచంలో యువకులు తమ పెళ్ళి విషయంలోనైనా తమకి స్వాతంత్ర్యం కావాలని, ప్రేమపెళ్ళిళ్లు చేసుకోవాలని కోరుతారు. వీరి దృష్టిలో ప్రేమించడం పెళ్లిచేసుకొని కామతృష్ణను తీర్చుకోడానికనే. అందుకు కాకపోతే ఈ ప్రేమపెళ్లిళ్లు అవసరమేలేదు.

అసలు ఈ ప్రేమపెళ్లిళ్లు నాకు తెలిసినంతవరకు, పాశ్చాత్యదేశపు నాగరికతకు సంబంధించినవి. ఈ పెళ్లిళ్లు చేసుకున్న యువతీ యువకులు స్వాతంత్ర్యులు భారతీయులవలె స్త్రీలు బానిసలు, పురుషులు నిరంకుశులు కారు.

ఈ ప్రేమపెళ్లి చేసుకున్న యువతీ యువకులలో ఏ ఒకరిద్దరో తప్ప మిగిలినవారికి తమ ఆశయము నెరవేరడంలేదు. పాశ్చాత్యులలో స్త్రీ పురుషులకు సమానహక్కు ఉండడంచేత ఈ ఆశయము నెరవేరని వారు తాము మొదట పెళ్లిచేసుకున్న యువతి లేక యువకులకు విడాకు (Divorce) లిచ్చి తిరిగి పెళ్లిచేసుకుంటారు. ఇది తమ ప్రియులందు ద్రోహమే కాని 'తనకుమాలిన ధర్మమా' అని ఎవళ్ల మంచివాళ్లు చూసుకుంటారు. వారిలో ఇది దోషములేని విషయమే.

కాని భారతీయులకు ఇది సహనములేని విషయము. అందువల్ల తమ కామతృష్ణని రహస్యంగా ఇతరులవల్ల నెరవేర్చుకుంటారు. దీని ఫలితం సంఘబహిష్కరణ, ఆత్మహత్య, కూనీకేసులున్ను.

ఎక్కడో ఫ్లూకిన (fluke) ప్రేమపెళ్లిళ్లను చూచి మిగిలినవారుకూడ లాటరీ వేస్తున్నారు. చివరికి వీరి జీవితం దుఃఖమయం, దుఃఖాంతం అవుతోంది. ఈ బారినుండి తప్పించడానికని పెద్దలు (తమ లే ప్రాయమందు తామూ ప్రేమపెళ్లిళ్లు కావాలని ఢంకా బజాయించిన పెద్దలు) అనుభవంమీద తమ వంశాంకురాలకి మేనరిక వివాహమో తప్పితే నియంత వివాహము (ఫలానా యువతి లేక యువకునే పెళ్లిచేసుకోవాలని శాసింపబడుట) చేస్తారు. కాని ఇందులో అసూయ, స్వార్థపరత్వము ఎంతమాత్రము లేవు.

దీనికి కారణము యువతీ యువకుల బాధ్యత ఆ యువతీ యువకులమీద ఎంతవున్నదో అంతకన్న ఎక్కువ బాధ్యత ఆ యువతీ యువకుల తల్లిదండ్రులు లేక సంరక్షకులపై (పెద్దలు) న ఉన్నదని చెపుతారు. తాముపడిన బాధలు తమ వంశాంకురాలు పడకూడదనిన్ని, తాము కష్టపడినా తమ వంశాంకురాలు సుఖపడవలెనని కోరుతారు.

వీరుచేసే పెళ్లిళ్లలో వధూవరులు సగోత్రీకులు కాకుండా చూస్తారు. దీని ముఖ్యోద్దేశం దుర్బల సంతానాన్ని కని 'సంతాన పంటభూములు' అనిపించుకోకుండా ఉత్తమసంతానాన్ని కని వంశం నిలబెట్టడం. డి. కె. ప్రసాద్ గారు జూన్ నెల గృహలక్ష్మిలో 'మేనరిక వివాహాలు కూడునా?' అనే వ్యాసంలో వ్రాసినట్లు 'మొదట్లో వివాహముకాని ఘోటక బ్రహ్మచారి తన మేనకోడలి లేక మేనమరదలి గోత్రం, తనగోత్రం ఒకటికాదన్న రహస్యం గ్రహించి, సగోత్రీకుడైన పైవాడు ఎవ్వడూ కన్యను ఎత్తుకుపోకుండా, స్వార్థపరత్వంతో ఏర్పరచిన షరతు' ఎంతమాత్రం కాదు. వధూవరుల గోత్రములు రెండూ

(పెళ్లికాకపూర్వం) ఒకటి కాకూడదన్న మరతు 'తన గోత్రము, తన మేనకోడలి లేక మేనమరదలి గోత్రము ఒకటికాదన్న రహస్యము' గ్రహించకపూర్వమే ఏర్పడింది. అది ఎప్పుడు? ఇత్యాది ప్రసక్తి అనవసరం. అసలు ఈ వ్యాసము ప్రసాద్‌గారి వ్యాసాన్ని ఖండించుటకుకాని, విమర్శించుటకుకాని వ్రాసినది కాదు. ఆ వ్యాసమును చదివిన తరువాత నాలో కలిగిన కొద్ది అభిప్రాయభేదాన్ని వెల్లడించి, నేటి నవనాగరికతా ప్రపంచంతో ఏకీభవించడానికని చేసిన ఓ చిన్న ప్రయత్నము ఇది.

తరువాత ఈ పెద్దలుచేసే పెళ్లిళ్లలో వరహీనంకాకుండా చూస్తారు. దీని ముఖ్యోద్దేశం వధువు వ్యభిచరించవలసిన అవసరం కలగదని. అంటే ఇతరునివలన కామతృష్ణ నెరవేర్చుకోనవలసిన అవసరముండదు. ప్రేమపెళ్లిళ్లకూడా ఈ సూత్రాన్ని అవలంబిస్తే చాలా ఉత్తమము కాని అసాధ్యము. దీనికి కారణము ప్రేమ, వయస్సు, కులము, మతము మొదలైనవాట్లనిపట్టి కలగదు.

జాతకాలనుపట్టి ఆయుర్దాయ సౌభాగ్యాలు, అన్యోన్యత ఉన్న వధూవరులకే పెళ్లిచేస్తూ వుంటారు. ఈ 20 వ శతాబ్దంలో జాతకాలమీద నమ్మకం పూర్తిగ పోయినప్పటికి పెద్దలకి కొంతవరకు సంతృప్తి.

సోదరీ సోదరుల పిల్లలు ఒకేకుటుంబములో పెరగడంచేత, వాళ్ళలో అన్యోన్యానురాగం, దాన్నిపట్టి ప్రేమ వుండడానికి వీలవుతుందని, ఒకళ్ళ స్వభావాలు (Nature and Psychology) ఒకరు అర్థం చేసుకుందుకు వీలవుతుందని, ఒకేరకపు అలవాట్లు (Habits and customs) కలవారై వుంటారని, వాళ్లే పవిత్ర వివాహసూత్రంచేత కట్టబడినపుడు ఆ సంసారంలో ఏవిధమైన భేదాభిప్రాయములులేక ఆనందమయంగా వుంటుందని మేనరికవివాహాలు తప్పకుండా చేస్తూవుంటారు.

భారతీయుని జన్మహక్కైన దారిద్ర్యాన్నుంచి విముక్తుల్ని చెయ్యాలని, అప్పుడుకాని సంసారంలో పూర్తి సౌఖ్యముండదని కట్నాలు పుచ్చుకుంటారు.

ఇవి యువకులకి నచ్చవు. డబ్బుకాసించో సంబంధం విడకొట్టుకోడాని కిష్టపడకో చేస్తూన్న పెళ్ళిళ్ళని నిరసిస్తారు.

అప్పుడు పెద్దలు చతుర్విధోపాయాలు ఉపయోగిస్తారు. చివరికి నియంతృత్వం అమలులోకివస్తుంది.

ఆ పెద్దల నియంతృత్వాన్ని ఈ యువకులు నవనాగరికతా ధర్మశాస్త్రప్రకారం ఔర్జన్యంతో అరికడతారా! ఫలితం అనుభవిస్తారు.

అందుకే 'కుపుత్రో జాయేత క్వచిదపికు.........' అన్నారు.

---

# ఘటన ఉండొద్దూ - పెళ్లిజరగడానికి - మన ఇష్టమా?

—— శ్రీ ఎమ్. వి. సూర్యనారాయణమూర్తి ——

ఆవేళ నన్ను పెందరాళే లేపేసింది మా అమ్మ. సాధారణంగా ఏడుగంటలుదాటేక లేచే మనిషిని ఈ నాడు చాలతొందరగానే లేవగొట్టబడ్డంలో ఏదో వింత విశిష్టత ఉండొచ్చని ఊహించుకుని నిర్ధారణ చేసుకున్నాను. పెందలకడే లేవడం నా దేహానికి ఆనవాయితిలేదు. ఆవేళ ఆనవాయితీ తప్పడం మూలాన్ని ఈ క్షుద్రదేహం ఎంతో క్షోభించింది. ఈ దేహానికి కావలసినవన్నీ సకాలంలో అందచెయ్యక పోతే ఎంతైనా కోపంవస్తుంది. ఆగ్రహం సత్యాగ్రహం అవుతుంది. అంచేత ఆ విషయంలో ఏమీ శక్తి ఉన్నంతవరకూ లోటుపాటు రాకుండా ఉండేలాగున ప్రయత్నిస్తూంటాను. అంత ఆర్టిఫిషల్ దేహం అయిపోయింది.

నేను లేవడం తరవాయిగా మా అమ్మ చెంబూనీళ్లూ పుడక పట్టుకొచ్చి అక్కడపెట్టి 'చప్పన మొహం కడుక్కోరా!' అని నిలబడింది. బద్ధకం ఎక్కువగాఉండడం మూలాన్న 'ఊ' అని గట్టిగా అన్నాను. అమ్మ హడిలిపోయింది. ఇంక-వీడు మాటలతో వినడని స్వయంగా పుల్లని రుబ్బురోలు పొత్రంకింద నలగకొట్టి బ్రష్‌లా తయారుచేసి పట్టుకొచ్చి నానోట్లో పెట్టింది. 'లేరా నాయనా' అంటూ బతిమాలుతూ నాదేహాన్ని దొడ్లోకి తీసుకొచ్చి నూతిచప్టామీద కూచోపెట్టింది. అప్పటికీ బద్ధకం అనే పదార్థాన్ని నా దేహంలోంచి తీసివెయ్యలేదు. మా అమ్మ ఆతురతా ఎక్కువవుతున్నట్లు ఆమె మొఖమే చెప్తోంది. ఆలస్యాన్ని భరించలేకపోయింది. గబగబ వచ్చి నా తలమీద చెయ్యేసి పుల్లపట్టుకుని పళ్లుతోమడం ప్రారంభించింది. అప్పటికి నాకు పదిహేను వెళ్లాయి. నా వయస్సు నాకు సిగ్గు తెప్పించింది. 'ఊ' అని మళ్లీ కసిరి స్వంతంగా మొహంకడగడం మొదలెట్టేను. ఆమె అలాగే నుంచుంది. నా వ్యవహారం గూడ్సు ట్రెయిన్‌లా కనబడింది. 'నే కడుగుతాను ఫరవాలేదురా, నాయనా' అంది. ఆ మాటల్లో ఎంత తల్లిప్రేమ యిమిడిందో అర్థంకాదు. ఆ మాతృప్రేమతో కూడుకున్న ఆ మాట నన్ను ఒక్కసారి కలవరపెట్టింది. రెండు సార్లు నేను ఆమెను గట్టిగా కసరడం నాకు జ్ఞప్తికివచ్చింది. ఆ ప్రేమ ఎంతకాఠిన్యాన్నైనా అసహ్యాన్నైనా మింగేస్తుంది. నాలో నేనే నా కాఠిన్యానికి మనస్సులో కించిత్కాలం కుళ్లిపోయాను. 'ఏమే-అమ్మా-ఈ వేళ ఇంత పెందరాళే లేపించావ్??' అనే చిన్నస్వరంతో కూడుకున్న మాటననిపించింది. తల్లిని ఏమే అమ్మాఅని పిలవడం ఇప్పటివరకూ పోలేదు. ఒక్కొక్కసారి లోలోపల నవ్వొస్తూంటుంది ఈ సంబోధన జ్ఞప్తికి వచ్చినప్పుడు, కొంచెం విచారంకూడా వేస్తూంటుంది. కాని నేనొక్కణ్ణే అలా పిలవటం లేదని సమర్థించుకుంటూ ఊరుకుంటాను.

'ఏమీలేదూ - ముందు అవశిష్టాలన్నీ కానియ్యి,' ఎందుకో ఈ తొందర నాకర్థంకావటంలేదు, అన్నీ అయాయి. చద్దన్నందగ్గర కూచున్నాను. 'ఈవేళ - నీకెవరో పిల్లనిస్తామని తూర్పునుంచి వచ్చారు. నిన్ను చూడ్డానికి వస్తారు. అంచేత చాకలితెచ్చిన బట్టకట్టుకుని, శుభ్రంగా నున్నగా తలదువ్వుకుని ఎంతో మంచివాడనిపించుకునీలాగ ఉండాలి.' అందా మాతృహృదయం. ఆహృదయంలో ఉప్పొంగుతూన్న ఆనందాన్ని గ్రహించలేం.

కొబ్బరినూనె పట్టుకొచ్చి తలకిపూసింది. తలదువ్వింది. నూనె ఎక్కువవడం మూలాన్ని చెంపలంట నుదురంట కారడం మొదలెట్టింది. నాలో నాకే ఊరికే నవ్వు తోసుకొస్తోంది. కారణం అర్థంకావటంలేదు. అమాయకమైన ఆ మాతృప్రేమని చూశా? ఒకయింటివాణ్ణి అవదలచుకున్నందుకా?

సరిగ్గా ఆరెండింట్లోనూ దేనికి నవ్వొస్తోందో నిర్ధారణ కావటంలేదు. రెండూ నవ్వు తెప్పించేవే? ఏనాడూ శుభ్రంగాను, మంచిగాను ఉండనిమనిషి ఎవరో ఎందుకో చూసిపోయ్యేందుకు వస్తూంటే నేనలంకరింపబడ్డం ఎందుకు? బట్టల్లోనూ, తలదువ్వుకోవడంలోనూ నేర్పరి అయిఉంటే చాలుకాబోలు!! తన పెద్ద కొడుకుకి దూరాన్నుంచి పిల్లనిస్తామంటూ వచ్చేరనే ఆనందం ఆ మాతృ హృదయాన్ని అలా కలవరపరుస్తూంటడం లోకంలోని సామాన్య గుణమే!!

ఒకయింటివాణ్ణవతున్నానూ అనే సరదాకూడా వేసుకొచ్చింది. ఆ సరద్దా ఎంతవరకు? పెళ్లికి బయల్దేరేసమయం దగ్గర్నుంచి ఆబాజాలు చప్పళ్లు వింటూంటేను ఆ పౌరోహితుడు కార్యాన్నంతనీ చేయిస్తూంటేను సుమంగళి ఆ అమాయిక కంఠానికి పెనవేస్తూంటేను మిగతా చిన్న చిన్న అలకపాన్పులు వగైరాలు అయీవరకూనే!!! పెళ్లయిన మర్నాడు హృదయం ఎంతో బరువుగా ఉంటుంది, ఆ సుఖం క్షణమాత్రమే!!

మా స్నేహితుడు మొన్నటివరకూ పెళ్లిచేసుకోరా అని అంటే అగ్గిఅయిపోయేవాడు. ‘ఏరా నీకంత అసహ్యం?’ అంటే ‘జీవితంలో సెటిల్ అవనీరా,—ఇప్పటికీ ఒక్క పొట్టకే గడవడం కష్టంగా ఉందీ—ఇంకో పొట్టనికూడా మెడకు తగిలించుకుని దాన్నికూడా మల మల మాడ్చడం ఎందుకూ?’ అనీవాడు. ఈ సమాధానం కాస్త సమంజసంగానే ఉంది. ఈ దారిద్ర్య దినాల్లో పెళ్లిళ్లు అనే మతకలయికలన్నీ పెట్టి ఎంత పెద్దచదువుచదివినా దమ్మిడీ సంపాదించలేకుండా ఉన్నవాళ్లకి పెళ్లాల్ని అంటించడం చూస్తే ఈ బాధపడేవాళ్లని ఇంకా హింసపెట్టదలచుకుందుకు గోషంతో మామలందరు కూతుళ్లని తగిలించ దలచుకుంటున్నారే! అని ఓ వింత అభిప్రాయం ఒక్కొక్కసారి మెరుపులా కనిపించి మాయమౌతూంటుంది.

అప్పటికి ఎనిమిది కొట్టింది. ఎంతో శ్రద్ధా భక్తుల్తోటి చదువుకునీవాడిలాగ నా అంతట నేనే పెళ్లి అనేమాట వినడంతోటే ఒక విధమైన ఆవేగమో, ఉత్సాహమో నాలో ఉబుకుతూండడం మూలాన్ని పెద్ద లావుపుస్తకం తీసేను. లావుపుస్తకాలు మాక్లాసుకెక్కడుంటాయి - అది డిక్షనరీ - ఏదో రిఫర్ చేస్తూన్నట్టు పేజీలు ఊరికినే ఇటూ అటూ తిప్పడం మొదలెట్టాను. చేతులు నెప్పెట్టుతూన్నట్టు కనిపిస్తోంది గాని నా హృదయం ఆవేశంతో దోబూచు లాడుతూన్నట్టు పేజీలింకా తీవ్రంతో ఇటూ అటూ గబ గబా తిప్పేస్తున్నాను. ఈలోగా మానాన్న వచ్చాడు. నా ప్రవర్తనంతా నవ్వుతెప్పించింది. గట్టిగా నవ్వేసాడు. ఒక్క నా నడవడికే కాదు నవ్వుతెప్పిస్తే, మా నాన్నకీ కొడుక్కి పెళ్లవుతుందనీ కోడలొస్తుందనీ సంబరంవల్లకూడా నవ్వొచ్చింది.

‘ఒరేయి నువ్విలాగే ఇంకోగంటసేపు కూర్చో, ఈ లోపుగానే వెళ్లి ఆయన్ని కలుసుకుంటాను’ అంటూ అతనికాళ్లు జోళ్లదగ్గరికెళ్లాయి.

‘కతుకుతే అతుక’దన్న సామెతమూలాన్ని అవబోయే మామగారు మా మేనమామగారింట్లో భోంచేసి అక్కడే రాత్రిగడిపి ఉదయాన్నే కాఫీలుకూడా ఆరగించి నా దర్శనంకోసం ప్రయాణం అవుతున్నారు. ఆవేళ శనివారం అవడంమూలాన్ని పొద్దున్న ఏడుగంటలవరకూనో 8 గంటలవరకూనో దుర్ముహూర్తంవేళ అవడంవల్ల ఇంకా నిరీక్షిస్తూ కూచున్నారు. మా నాన్నా సరిగ్గా దుర్ముహూర్తంవేళ దాటడం తరవాయిగా గబ గబ వారికి ఎదురు సన్నాహం వెళ్లి ఆహ్వానపత్రాన్ని అందిచ్చాడు.

మా యింటిముందర బండిచప్పుడయింది. వెయ్యితేళ్లూ జెర్రులూ నా దేహంలో పాకుతున్నట్టయింది. ఒకవిధమైన భీతిచేత కళ్లు కాళ్లూ తొట్రుపడుతున్నాయి. ఆయన వచ్చేశారుకదా అని నా బుర్ర

# చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖ

## పారిశ్రామికశాఖా ప్రారంభము



పారిశ్రామికశాఖను విజయవంతముగ నడిపించుటకగు ధనమును భూరివిరాళముగ నొసగిన

శ్రీమతి రాణీ రావు రాజ్యలక్ష్మి మురళీకృష్ణారావుగారు

ఆంధ్రనారీజనోద్ధరణ, ఆంధ్రాభ్యుదయం ఆదర్శంగా గలిగిన ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖ విద్యావ్యాప్తికి, విజ్ఞానాభివృద్ధికి, కళావికసనానికి జయప్రదంగా కార్యక్రమమును కొనసాగించుచున్నందుకు మిక్కిలి సంతోషించుచున్నాము.

ఈ స్త్రీలశాఖ వినోదస్థలముమాత్రమే కాదు. అచ్చట ఇదివరకే ఉత్సాహవంతముగా హిందీ, తెలుగు, బెనారెస్ మెట్రిక్యులేషన్ తరగతులు, నృత్యము, సంగీతము, చిత్రలేఖనము నేర్పు లలితకళాశాఖ, సారస్వతశాఖలు కడు సమర్థముగా నడపబడు చున్నవి. కాని వలసిన ధనాభావముచే పారిశ్రామిక శాఖ నేటివరకు ఏర్పాటుకాలేదు. ఇప్పుడా కొఱతను దీర్చి తచ్ఛాకా నిర్మాణ నిర్వహణములకగు ద్రవ్యము నొసగిన శ్రీమతి రాణీ రాజ్యలక్ష్మిగారి మహదౌదార్యమెంతయు కొనియాడదగినది. ఈ స్త్రీల పారిశ్రామిక శాఖ మైలాపూరు స్త్రీలశాఖా సభాభవనావరణంలో ప్రారంభింపబడింది. ఈ పారిశ్రామిక శాఖయందు స్త్రీలకు బట్టలకు రంగువేయుట, అద్దకములు చేయుట, బుట్టలల్లుట, (పేముపని), కాగితాలు తయారుచేయుట, నవారు నేత, మొదలగు గృహపరిశ్రమలయందు తర్ఫీతు ఇవ్వబడును.

గృహపరిశ్రమలు స్వతంత్రజీవనానికి దేశసౌభాగ్యానికీ సాధనభూతములు.

ఇట్టి పరిశ్రమలలో స్త్రీలను ఉచితముగా తర్ఫీతుచేయుటకు స్త్రీలశాఖవారు యేర్పాటుచేయుట మిగుల ప్రశంసనీయము.

ఔదార్యఘనులగు ఇతర శ్రీమంతులుకూడ తమ భూరివిరాళముల నొసగి ఈ స్త్రీలశాఖను అభివృద్ధికితెచ్చు టత్యావశ్యకము.

రెండు సంవత్సరాలైనా పూర్తిగా నిండకుండానే స్త్రీలశాఖను యింత అభివృద్ధిలోకి తీసుకువచ్చిన చెన్నపురి ఆంధ్రస్త్రీల కార్యనిర్వాహణదక్షత ఆశ్చర్యం కలగజేస్తుంది. అన్ని విధములైన విషయాలకు ఆంధ్రస్త్రీలకు యీ సంఘం కేంద్రంగా వుండి ఆంధ్రకీర్తికి ఒక కర్ణధారి కాగలదని ఆశిస్తాము.



కస్తూరి ఫిలిమ్సు 'అపవాదు'లో అనసూయ
భూమికను అతి నైపుణితో నిర్వహించిన పూర్ణిమ.

అప్రయత్నంగా పుస్తకంమీదకి వంగింది. అది చూసి ఆయనమనస్సులో నవ్వుకున్నాడు. గొప్పశ్రద్ధగా చదివే కుర్రాడనిపించుకోడానికి ఈ ప్రయత్నాలన్నట్టు ఆయన గ్రహించాడు. ఆయనపెదవులు నవ్వుని వెనక్కి తోశాయి.

అలాంటప్పుడు నేనుకూడా లేచి ఏదో ఎటికెట్ కి భంగంరాకుండా 'దయచెయ్యం'డనో 'కూచోం'డనో అనేసి పుస్తకమ్మీద చెయ్యిఅని ఆయనకేసి ఓసారి విచిత్రమైన చూపుల్ని విసురుతూ కూచుంటే నాలోఉన్న తెలివితేటలూ సమయస్ఫూర్తి కనబడును. అదేప్రథమం అవడంమూలాన్ని అనుభవం తక్కువవడంచేత ఏదో వెర్రిమొర్రి చేష్టలు, నటన చేసాను. 'ఈ అబ్బాయికి కంగారెక్కువ' అనుకున్నాడా అని నేను తర్వాత అనుకుని బాధపడ్డాను. నాకెప్పుడూ ఆనమాయితే సమయంలో సరిగ్గా నటించకుండా మొద్దబ్బాయిలా ఉండడం తర్వాత అరెరే ఇలా ఇలా చెయ్యవలసింది చేశాంకాం అని ఫీలవడమూను. ఆ విధమైన ప్రవర్తన మార్చుకోవడానికి నా తాతలు దిగొస్తున్నారు.

కుశల ప్రశ్నలు అయినతర్వాత వ్యవహార విషయాల చర్చ జరిగింది - ఏవో బేరాలుకూడా అంత Plain గా కాకపోయినా ఆ అభీష్టంఉన్నట్టు చూచాయగా తేలడం కూడా సంభవించింది. మామ గారు బాగా తడిఉన్నమనిషి కాబట్టి పిల్లఎదిగి ఉండడం మూలాన్ని తొందరపడి నాన్న నోటంమ్మట వచ్చింది వేదాక్షరంలా చూచాడాయన. అమ్మ, ఇంట్లోఉన్నవాళ్లూ, చంకలెగరేస్తున్నారు.

పిల్లని చూడ్డానికి మీ యబ్బాయిని పంపిస్తే పంపించండి! అన్నారాయన. "సరే" నని నాన్న అంగీకారాన్ని తెలుపుతూ 'ఏరా!' అని నాకేసి తిరిగేడు. దగ్గర దగ్గరగా కలకత్తా వెళ్లాలి. కూపస్థ మండూకంలాఉన్న నాస్థితిని ఇప్పుడు మార్చుకోవచ్చుననే ముఖ్యోద్దేశంతో "ఊ" అన్నాను.

హాయిగా ప్రయాణంచేసి కొస్త ప్రపంచజ్ఞానాన్ని సంపాదించుకొన్నాను - పిల్లకూడా నాకు సంతృప్తిగానే ఉంది. నాకు సేవచేసెడి పిల్ల ఇంకత్వరలో రానున్నదన్నమాట. సేవచేయించుకోటానికి దమ్మిడీ అర్హతలేని మానవజీవులకు కూడా వారిజీవితాల్లో ఆడపిల్ల చేత సేవచేయించుకోవడం తప్పటంలేదుకదా! అర్హతా అనర్హతా ఏమిటీ అదొక సాంప్రదాయం, శాస్త్రం, తప్పనిసరి అయికూచుంది.

హృదయపూర్వకంగా ఆహ్వానించాను.

చుట్టాలకీ పక్కాలకీ తెలిసింది. 'రామిగాడికి పెళ్లిట్రోయ్' అంటూ హేళనచేశారు కొంత మంది. అవును - పెళ్లికొడుకులెక్కడా దొరకడంలేదు పిల్లలకి. అయినప్పుడు అనాకార్లకీ ఇవ్వక, డబ్బులేని వాడికి ఇవ్వక, ఇంట్లోపిల్లని ఎదగబెట్టుకు కూచుంటారేమిటి?! అంటూ పాము చావకుండా మాట్లాడేరు లిటిగెంట్సు. లోకం ఎలాఅనుకుంటున్నా ఈ మాటలకి నాదగ్గర బంధువులు మనస్సునొచ్చుకున్నా నిజం చెప్పొద్దు నాకుమాత్రం బ్రహ్మానందం వేస్తోంది. శుభ ముహూర్తాన్ని నిరీక్షిస్తున్నా. పనులు జోరుగా జరిగి పోతున్నాయి. ఫ్రెండ్సుఅందర్ని ప్రయాణం కట్టమన్నాను. అన్నీ రెడీఅయాయి.

ఇంతలోకే బాంబులా ఓఉత్తరం వచ్చింది. అందులో, మా ఋషులు వాళ్ళఋషులూ ఒక్కరే అయార్ట. అంచేత పెళ్లిచెయ్యడం శుభకరంకాదు అన్నారట పెద్దలంతాను. అంతా సిద్ధపరచుకున్నాం. డబ్బు దండగ అయింది. అంతా ఒకళ్లమొహం ఒకళ్లు చూచుకున్నారు.

ఇంతకీ ఘటన ఉండొద్దూ - పెళ్లిజరగడానికి - మనఇష్టమా? దైవఘటన!



# ★ వరకట్నము ★

శ్రీమతి జగుగుమిల్లి రామాబాయమ్మ

స్త్రీలు విద్యావతులయినకొలది వరకట్నములు మితిమీరుచున్నవి. ఈ శారదాబిల్లు వచ్చిన తరువాత మరి విపరీతములుగ వరకట్నము లెగసినవి. ఏలన! చిన్నప్పుడే వివాహమగుచో వరుడు ఏ స్కూలు ఫైనలో చదువుచుండెడివాడు. వానికి ఏ 5 వందలో లేక ఏ 2 వందలో ఇచ్చిన వివాహము సలక్షణముగ జరిగెడిది. క్రమేణ ఆవరుడే బి. యల్. ప్యాసై యే యున్నతోద్యోగమో చేసి సంసారము రాజభోగంగా జరిపేవాడు. ఇప్పుడో పెద్దపిల్లనేగదా వివాహమాడునదని, బి. యల్. దాక చదువుచెప్పించి అప్పుడు వివాహముచేయుట మొదలుపెట్టి దానితో రేటుహెచ్చు స్థాయి చేసివేసినారు. స్త్రీని వివాహము గాకుండా, పురుషుల దృష్టినుండి తలితండ్రులెన్నినాళ్లు కాపాడగలరు? అందుచే యే ఇల్లో, నగో అమ్మి ఆ వరకట్నముపోసి వివాహముచేయుచున్నారు. అవతల తిండిలేక మలమలమాడుచున్నారు. ఇది వక్క పిల్లయా? ఇంకా ఇద్దరు ఇంకాముగ్గురు. వీరికి వివాహమెలాగ? సరి, వివాహమయిన పిల్లకు అత్తగారు ఇంకా కట్నము చాలదు అది ఇది తెమ్మని సాధింపు. ఇంక వారిగతి చూడుడు. ఈలాగున ఒకరా ఇద్దరా? యెన్నియో వేల కుటుంబములు ఈ వరకట్నములకు బలియగుచున్నవి. కావున స్త్రీలకు వరకట్నములు లాభకరములు కావు. ఈ వరకట్నములకు, మన స్త్రీలే, కారణము. ఏలన, పురుషుడింత తెగనలుగలేదు. ఒకానొకడు, తనకిష్టములేకున్నను, భార్యపోరువలననే, వరకట్నము, తీసుకొనుచున్నాడు. స్త్రీ తలచిన, భర్తచే వరకట్నము తీసుకొనకుండచేయగలదు. కాని, అటులచేయు స్త్రీలేరీ? తమ కన్యలకొఱకు ఇంత కష్టపడియు, తమకొక పుత్రుడున్న తిరిగి యథాప్రకారమే వరకట్నములు పుచ్చుకోక పోయిన, వారిఘనత తగ్గునని వీరి ఆశయము. సంఘములో, గౌరవమేలేదు. ఏ పుణ్యాత్ముడో ధర్మానికి కట్టుబడి వరకట్నము తీయకున్న, వానికి అపరాధపన్నే సరిగదా! వారిని నీచాతి నీచముగ చూడడము, వాళ్లకేవళ్లిస్తారు, వాళ్లకేమియున్నది యని ఉపోద్ఘాతము మొదలెత్తారు. కట్నము పుచ్చుకొన్న, వానికేమిలేకపోయినా సరే వానిని గొప్పసన్మానము చేస్తారు. ఆహా! కాలవైపరీత్యము. దీనిని మాన్పెడు పుణ్యాత్ములున్న దేశముద్ధరింపబడును. కాని ఏ స్త్రీఅయినను ముందంజవేసి, వరకట్నము పుచ్చుకోకుండా యుండిన, సంఘమునకు, స్త్రీ లోకమునకు గౌరవము, కీర్తి దెచ్చినవారగుదురు. ఏదీ అట్టి ఘనతగల స్త్రీ! మీటింగులకుపోయి వరకట్నములు పుచ్చుకో కూడదని బల్లలు గ్రుద్దిచెప్పెడువారేకాని, జరిపెడువారొక్కరూలేరు. కూరల బేరమువలె, మనుష్యులకు వెలలా? అమ్మో! ఆపిల్లవానికి వెల యెక్కువ, అంతఇవ్వలేము. ఇంకొక తక్కువధర పిల్లవానిని చూడండి యని, నుడువుచుందురు. సిగ్గు...సిగ్గు...ఇంతకన్న హైన్యముకలదా! యెంత చక్కతనమున్నను చదువు సంగీతము లెన్నియున్నను, ఎంత గొప్పవంశమైనను, డబ్బు యివ్వలేనిచో, ఉహు—ఎవ్వరూ మాట్లాడరు. నిండుయౌవనముతో ఇవన్నియుండియు, డబ్బులేక ఆ పిల్లజీవితము వ్యర్థమగుచున్నది. ఆడపెళ్లివారు, మొగ పెళ్లివారిని వరకట్నం ఒక్కవంద అయినను తగ్గమని యెంత బతిమాలినను, ఒప్పుకోరు. జాలిగాని, దయగాని, సున్న. అప్పుడాహృదయము కర్కశహృదయమై చలించదు. యెదుటివారు మనవంటి మానవులేయని తోచదు. వివాహమప్పుడు ఆ డబ్బులో ఏమైనా తక్కువ ఉండునేమోయని, ఒకానొకడు లెక్కచూచుకొనును. ఆహా! ఈ వరకట్నపిశాచమును, ఏమహానుభావుడైనను, మాన్పిన, యెంతయో పుణ్యముండును. ఇది పూర్వమునుంచి లేదు. నవీన నాగరికత బలిసినకొలది, దీని తేజస్సు వృద్ధియగుచున్నది. దీనివలన స్త్రీలోకము కష్టపడుచున్నది. మనము లెక్చర్లు ఇవ్వటముతోనే తృప్తినందక, వరకట్నము పుచ్చుకున్నవారలను బహిష్కరించియు, ప్రతిఇంటికివెళ్లి ప్రచారముచేసియు, ఈ భయంకర కట్నపిశాచమును పారదోలుటకు సంసిద్ధులు కావలయును. దీనికెంతమంది సోదరీమణులు ముందంజవేయగలరో!

# ధర్మబోధ

శ్రీ గుంటూరు సత్యనారాయణ ఎం. ఏ.

[ కర్ణుడు కృష్ణునితో ]

"జూదము లాడువేళ వెనుజూడక రాజ్యమునొడ్డె ధర్మజుం
డేదయ ధర్మమిందు? తన కెవ్వరొసంగిన హక్కు? శాస్త్రసం
వేది నటించు తానెటుల వేషములేసిన చెల్లునే? ప్రజల్
జూదములాడు పాచికలొ? చోద్యము కూర్చెడి తోలుబొమ్మలో?

ద్రౌపది వస్త్రముల్ తివిసె రాజ సభాస్థలినంచు రోసముం
జూపగనేల పాండవులు?-జూదమునన్ సతినొడ్డు ధర్మజున్
పాపము లంటవో? వనిత వస్తువొ? విత్తమొ? మ్రానొ? మ్రాకొ? వాం
ఛాపరితృప్తికై మహిని జన్మమునెత్తిన వింతజంతువో?

మానము కాపుసేయ పలు వస్త్రములిచ్చిన దిట్టవంచు స
న్మానములందితీవు! సతి మానము భౌతికమో? నృపాలుడ
మ్మానిని యాత్మగౌరవము పందెపు వేదికనొడ్డునాడు నీ
దీనశరణ్య కంకణము త్రెళ్లెనొ? మ్రగ్గెనొ? బుగ్గియయ్యెనో?

కన్నియకుంతి నన్ను తను గాంచిన నా డెడబాయకుండుచో
యెన్నగరాని శాస్త్రములు నెన్నియొ ధర్మము లామెశీలముం
మన్ననజేసి కర్ణునికి పట్టము గట్టియెయుండు! భోగసం
పన్నుల పాపరతులు, విపన్నులగాచునె మీదు ధర్మముల్!

ధర్మము వీడజాలనని ధర్మజుతోడను కుంతిదేవితో
కర్మమె పెంచెనన్ను తను గాంచినదాదిగ నమ్మ; పాండవుల్
ధర్మము పేరిటంజరుపు దారుణచర్యల కొల్లమండి నే
మర్మము వీడి పల్కినవి మన్నన చేయుము నందనందనా"!!




## పెదవులు

పెదవులపై చర్మము బహుసున్నితమైనది. దాని నొకసారి నిర్లక్ష్యము చేసినచో నది ముడుగు బారి బీటలువారును. తరువాత ఎంతయో శ్రద్ధ తీసికొనినగాని మొదటి మృదుత్వము దానికి తిరిగిరాదు. కాబట్టి పెదవులవిషయమై తగు జాగరూకత తీసికొనవలెను. సిగరెట్లు హెచ్చుగా కాల్చుటచే పెదవులు నల్లబడి యారిపోయి పగులును. కొంతమంది తీరికగాయున్నప్పుడు పెదవులను కొరుకుకొను దురభ్యాసముండును. అందుచే వానిపైనుండు పలుచటి చర్మము మాటిమాటికి తొలిగింపబడి యవి మొద్దుబారుటయు, కొన్ని పెదవుల యాకృతి చెడుటయు తటస్థించును. శీతకాలములో రాత్రులందు పెదవులకు నెయ్యిరాయుటచే మెత్తబడును. మంచి యారోగ్యముగలవారికి పెదవులు రక్తముతోనిండి యరుణకాంతితో నుండునుగాన యారోగ్యమునకై శ్రద్ధతీసికొనుము. పెదవులెర్రగానుండుటకు పాశ్చాత్య యువతులును, మనదేశమందు పార్సీలు మొదలగువారును రంగువేయుదురుగాని తాంబూలచర్వణ మంతటి సులభమయినదియు, గుణకారియు, హిందూసుందరికి మరొకటిలేదు.

## దంతములు

ముత్యములదండనుబోలు దంతములవరుస కలిగియుండుటకు దంతములను పరిశుభ్రముగా తోముకొనుట ముఖ్యావసరము. బ్రష్షునుపయోగించినచో దానికుంచి కురుచగను, ఒత్తుగను యుండునట్లు చూడుము. మిక్కిలి బిరుసుగాయున్న కుంచిని విసర్జించుము. అట్లే పుల్లతో దంతధావనము చేయబూనినచో ఉత్తరేణి, కానుగపుల్లలతో చేయుము. అవి మెత్తని కుంచినిచ్చి పండ్లను శుభ్రపరచు కమ్మనిరసమునుకూడ యొసగును. వేపపుల్ల యెండినచో సరియైనకుంచి రాకపోవుటయేగాక, దాని పీచులు సూదులవలె చిగుళ్లలో గ్రుచ్చుకొనును. తుమ్మపుల్ల కొందరి కంగీకారముకాకపోయినను, త్రోసివేయతగినదికాదు. అది మంచి కుంచి నిచ్చునదియేగాక సర్వసాధారణముగ దొరుకు పుల్ల.

దినమునకు రెండుసార్లు, ఉదయము సాయంత్రము దంతములను తోముట యవసరము. ఒకేసారి తోముకొనినచో రాత్రిభోజనమయిన తరువాత యాచరణీయమని కొందరి పాశ్చాత్యుల యభిప్రాయము. అది హిందూపద్ధతులకు విరుద్ధముగా కానవచ్చినను కారణరహితమైలేదు. ఉదయమునుండి సాయంత్రము వరకు తినినభోజనమందలి యేపదార్థముగాని చిగుళ్లలో నిలచియుండి రాత్రియంతయు క్రుళ్ళి పండ్లకు హాని చేయకుండునట్లు రాత్రిసమయమున పండ్లను శుభ్రపరచుట యవసరమని దీని వాదము. పండ్లు తోమునపుడు ప్రతిపంటియొక్కయు, ఎదుటి, వెనుకభాగములేగాక ఇరుప్రక్కలనుకూడ శుభ్రపఱచవలెనని మనమున జ్ఞప్తి యుంచుకొనుము. కుంచిగాని పుల్లగాని పండ్లవరుసపై యడ్డముగా రుద్దక పైనుండి క్రిందికి వరుసగారుద్దుము. ఈ విషయములో సిగరెట్లుత్రాగువారు మఱింత శ్రద్ధతీసికొనవలెను. పండ్లుతోముకొనునపుడు రక్తము వచ్చుటచే భయపడకుము. అది ప్రకృతిలక్షణమే.

చక్కనిపండ్లవరస కలిగియుండుట మంచి యారోగ్యముపైనను శరీరతత్వముపైనను ఆధారపడి యుండును. చిన్నతనములో పండ్లువంకరగా వచ్చియున్నచో, కుదుళ్లు గట్టిబడియుండవు గనుక, సరియయిన రీతిని వాటిని దినమునకు నాలుగయిదుసార్లు నొక్కుచు వచ్చినచో చాల గుణమిచ్చును. కొంతమందికి పండ్లు బహుచిక్కగావచ్చి నోటిని కప్పివుచ్చును. అట్టివారికి పదిసంవత్సరముల ప్రాయము మించనప్పుడు తెలివయిన పండ్ల వైద్యునిచే నొకటి రెండు పండ్లు తీయించివేసినచో మిగిలియున్న యితరపండ్లు పెరిగి ఆ సందులను పూడ్చివేయును.

దంతముల నశ్రద్ధగ తోముటచే వానిపై ప్రాకుడుకట్టును. ఒకానొకప్పుడు తీయనిపదార్థముల నపరిమితముగ తినుటవలనగూడ యిట్లగును. ఎందువలన కలిగినను ఇది అందవికారము కాకమానదు. ఇట్టి దంతములను మెగ్నీషియాపొడి కొంచము బ్రష్షుపైయుంచి నాలుగుదినములు తోమినచో యది నశించును. ఏకారణముచేగాని రంగుచెడిన దంతములను శుభ్రపఱచి ప్రకాశవంతముగజేయుటకు 'ప్యూమిక్' రాతిపొడి మంచిది. ఈ పొడితో దంతములను రుద్ది వేడినీటితో కడిగికొనిన దంతకాంతి వృద్ధిజెందును. కాని తఱచు దీని నుపయోగింపజనదు. బజారులో బహుచవుకగా యమ్మడు పోవుచున్న దంతచూర్ణములు దంతములకు కీడు తెచ్చుచున్నవి. అందు రంగు చేర్చబడిన ఊకపొడియేగాని వేరొకటియుండదు. దానికి బదులుగా సముద్ర లవణమును బాగుగా చూర్ణముచేసి యుపయోగించినచో యెన్నియోరెట్లు మంచిది. గుణకారియగు దంత చూర్ణము నీ క్రిందివిధముగ చేసికొననగును. ఒకతులము సీమసున్నపుపొడి ఒకతులము ఆరిసురూటుపొడి లేదా ఏరోరూటుపొడి శనగగింజయంత హారతికర్పూరము, 4 చుక్కలు యూకలిప్టసు ఆయిలు బాగుగా మిళితముచేసి ఒకగాలిపోని సీసాలో యీ పొడిని భద్రపఱచుము.

పండ్లు పిప్పిపట్టి చెడిపోయినను, కదులుచున్నను జాగ్రత్తగ వానిని లాగించివేసె యాస్థానమున దంతవైద్యునిచే పండ్లు కట్టించుకొనుట మంచిది.

## గడ్డము

*పలుచని శరీరము గలవానికి గడ్డ మెల్లప్పుడును అందముగ నుండును. కొంచెము స్థూలముగ నున్న వారిలో కొంతమందికి గడ్డముక్రింద కండ పెరిగి రెండు గడ్డములవలె జూపట్టి యందమును చెడుచుటయు గలదు. అట్టిదానినుండి తప్పించు కొనుటకు మూడు మార్గములు కలవు. గడ్డము క్రిందనున్న కండను బిగియబట్టి కంఠముపై చేయినుంచి చర్మమును క్రిందికిలాగి ఆకండను మెల్లగ యటు నిటు రుద్ది సరిచేయుట మెదటి విధానము. ఇది చాలా కాలము చేసినగాని ఫలితము కనబడదు. *రెండవది కట్లుకట్టుటచే కండను సరియయిన స్థానమున నుండునట్లు చేయుట. కొన్ని నెలలపాటు ప్రతిరాత్రియు, గడ్డముక్రింద కండను, చమురుతో నిమిరి గుడ్డతో చెవులమీదుగా కట్టుకట్టినచో కండ తగ్గును. కట్టుగట్టిగయుండి రక్తప్రసారము నాపు చేయునట్లుండ రాదు. గట్టిగ లేకున్నచో కట్టిన లాభమేయుండదు. పరిశ్రమ చేయుట మూడవ విధానము. ఇది తప్పక గుణ మిచ్చుటయే గాక త్వరలోకూడ దీని ఫలితమును చూడనగును. తలను వీలయినంత వెనుకకును ముందునకును మెమ్మదిగా యాడించుము. తల ముందుకు వచ్చునప్పుడు నోరు బాగుగా తెరచి యుంచి గడ్డముక్రింది కండరముల బిగబట్టుము. తలపైకి వెళ్లినప్పుడు కండరముల బాగుగ సాగనిమ్ము. తలను ప్రక్కలకు వీలయినంత వరకు, గడ్డము భుజముల మీదికిపోవునట్లు త్రిప్పుట, తరువాత చేయవలసిన పరిశ్రమ. ఇట్లుచేసినచో కొన్నివారములలో గడ్డము మార్పుచెందినట్లు చూడవచ్చును.

(సశేషము)

—శ్రీ అలంపురం రాజు, బి. ఏ.

# కన్న ప్రేమకంటె పెంచిన ప్రేమయే ఎక్కువ

## వింత - సమస్యకు జబాబులు

[జూన్ నెల గృహలక్ష్మిలో ప్రచురింపబడిన "మీకు ఏబిడ్డకావాలి?" అనే ప్రశ్నకు వచ్చిన ఈ క్రింది జబాబు వ్యాసములలో అధిక సంఖ్యాకులు కన్న ప్రేమకంటె పెంచిన ప్రేమయే బలీయమని తేల్చిరి. ఈ లేఖలన్నీ ఆలోచనను పురిగొల్పునవై యున్నవి. శ్రద్ధాజనకముగను పఠనీయముగను ఉన్నవి.]

"జయా! చిన్నవిచిత్ర సంఘటన, చాలాకాలం క్రితం జరిగినవిషయం, యీనాడే నాకు తెలియ వచ్చింది......" మావారు అప్పుడే ఆఫీసునుండి వచ్చారేమో, కోటుతీసి చావడిలో కొయ్యకు తగిలిస్తూ-అని-యింకేదో చెప్పబోయి ఊరుకున్నారు.

నేను:- 'అదేమిటి! అలా ఊరుకున్నారు? చెప్పండి ఆ చిత్రవిషయమేంటో' అని అడిగాను.

వారు:- అబ్బే! యేమీలేదు. నువ్వు నమ్ముతావో లేదో! ఆ?

నేను:- 'నమ్మనీ. నమ్మకపోనీ. వింటేతప్పా?' అని నవ్వుతూ అడిగాను.

వారు:- 'మన లీలయేది?' అని అడిగారు. మనసు యింకెక్కడనో సంచరిస్తున్నది. ఆ ముఖమే చెప్పివేస్తూ ఉంది.

నేను:- 'వేళకే స్కూలునుండి వచ్చింది. ఫలహారంచేసి పొరుగింటి పిల్లతో ఆడుకుందుకు వెళ్లింది. దానికేమైనా కొనితెచ్చారా యేంటి?'

వారు:- 'లేదుగాని, జయా! ఈలీల మనబిడ్డ కాదట' అంటూ బల్లపైనున్న 'టీ' తీసుకొని కిటికీ దగ్గరగా వెళ్లి కొద్ది కొద్దిగా 'టీ' త్రాగుతూ వీధిలోనికి చూస్తు నిల్చున్నారు.

ఆమాటలు వినగానే, నామనసు- నాకు తెలియకుండానే-జల్లుమంది. ఒక లిప్తమాత్ర సమయమే. వెంటనే నాకు అపరిమితమైన నవ్వువచ్చింది. నేను గట్టిగా నవ్వుతూ సగంకట్టిన కిల్లీని బల్లమీదనే ఉంచిచేసి 'అవును! నేను మీదాననా, మీరు నావారా! లీల మన దనడానికి! క్రైస్తవులన్నట్టు మనం అందరం ఆదేవుని బిడ్డలమేకదూ' అని మళ్లీమిక్కిలిగా నవ్వసాగాను. 'ఇదేనా విచిత్రసంఘటన! యింతకన్నా అసభ్యపు విషయంఉంటుందా? లీల నా బిడ్డకాదట! యీ మాట తలంచినకొద్ది నాకు నవ్వు యెక్కువైపోతూఉంది.'

వారు:- చటున నావైపు తిరిగి 'ఇందుకే ఆవిషయం నీతోచెప్పడానికే మొదట్లో నాకు మనస్కరించలేదు. చెప్పకూడ దన్నసంగతన్నా, సగంచెప్పినమీదట స్ఫురించింది-దానికేం. యిదీ కొంతమంచికేను-లీల మనబిడ్డకాదు. నిజంగా మన......'

నేను:- మాటకు అడ్డువచ్చి, నవ్వుతూనే 'చాల్లెద్దురు! యెవరైనా నవ్విపోతారు, 'మీ మాటలు వింటేను'

వారు:- జయా! నిజంచెప్తున్నాను. లీల మన బిడ్డకాదు. నమ్ము. నమ్మకపో!!

నేను:- మీకు యిదేంవెర్రి, పోనిద్దురు! లేక ఆఫీసులో పనిచేసి చేసి, మనసు విసిగెత్తిందా! వంటగూడ అయి పోయింది. ఈరాత్రి సినిమాకువెళ్దాం. మీకు ఆఫీసులోను పనేను; యింటికివస్తూ ఒక మణుగుబరువు వెంటను పట్టించుకవస్తారు. మెదడు వేడెక్కి వింతభ్రమలు పుట్టవా?" అంటూ సవినయంగా అన్నాను. ఆయన మొఖంలో విషాద రేఖలు పొడచూపాయి. ఆఫీసునుండి వచ్చిన దగ్గరనుండీ ఖులాసాగా లేదు. నామనసులో కొంత అనుమానం గూడా కలుగజొచ్చింది. గాని యీ వింతకబురును నమ్మడం యేలాగు?

వారు:- కొంతవరకు నాముఖంలోనికి తీక్ష్ణంగా చూస్తూ తటాలున-"ఏదీ నీచెయి ఇలాఅందీయి" అని దగ్గరగావచ్చి నా కుడిచేతిని తన యెడమ చేతితో పట్టి నాచేతులో చేయివేసి 'జయా! సత్యప్రమాణంగా చెప్తున్నా. నిజం తెలియడం యెందుకైనా మంచిది' అని తీక్ష్ణంగా అన్నారు.

"ఆ!ఆ!!" అన్నశబ్దాలు అప్రయత్నంగా నానోటివెంట వచ్చాయి. "నిజమే!!" అని యేమీ తోచక వారిముఖంవైపు చూస్తూనిల్చున్నాను.

వారు:- చూడు! రోజంతా పడినపాటే యిది. యీ కాగితాల్నిచూస్తే నీకే తెలిసిపోతుంది. నీవు పురుడైన నాడే ఇంకొకరుగూడా పురుడయారంట. అప్పుడే యీ మారుగిల్లు అయాయంట. మనబిడ్డ ప్రస్తుతం యేలూరులోఉందట.' అని కొన్నికాగితములు నాకు అందించారు.

నేను:- వాటిని తీసుకొని చదివి యింకేవిధమైన మనఃప్రవర్తనలేక సంకోచమిళితమైన ఆశ్చర్యంతో నిండిన ఆందోళనలోబడి కొట్టుకపోతూ-'అయ్యో! లీల నాబిడ్డకాదు? అబ్బ నమ్మలేనండి...అయినా నమ్మకపోవడ మేలాగు?' అని దీర్ఘమైన ఒక్కనిట్టూర్పు విడిచాను (నట.)

వారు:-'ఒకచిన్న విషయం జ్ఞాపకంతెచ్చుకో. లీల మన యిద్దరిలోను యెవరిపోలికా కాదని నేనంటే మీ అమ్మ పోలికండీ అంటూ నిర్ధారణచేశావు కావు ఆనాడు?'

నేను:-'అవును. మూడుమూర్తులా మీ అమ్మపోలికే నండి. ఆరేళ్లయిందా, యిప్పటికీ అదేరూపు, యేమాత్రమైనా మార్పులేదే!'

వారు:-'గాని యీ ఫోటోచూడు. మూడుమూర్తులా నిన్నేపోలివుంది. మారుగిల్లయిన మనబిడ్డది. మూడ్రో యేట తీయించారట'

నేను:-'ఏదో కొద్దిపాటి పోల్తిఉన్నట్టుగా ఉంది, కాని యే ముండ చేసిందో కదా యీ పని......లీల నాబిడ్డకాదూ? నాకుతెలియకుండా యెలా మారుగిల్లు అయారు?—యెంతటి పొరపాటు!!'

వారు:-'దానికేం! జరిగిపోయినదానికై యిప్పుడు విచారిస్తే యేమిలాభం? ప్రస్తుతం ఆలోచించవలసిన విషయం యేమంటే—లీలను తీసుకొని ఆ బిడ్డను యిచ్చివేయడానికి వాళ్లు యిష్టపడుతూ ఉన్నారు. యేమంటావు?'

నేను:-'లీలనే! నా చిట్టితల్లినే!! యిచ్చివేయాలా?—ఆరేళ్లుపెంచిన యీ నా బిడ్డను వాళ్లకు యిచ్చివేయడమే!! అబ్బా!-' అందోళనాయత్తచిత్తంతో చేరువనున్న కుర్చీలో కూలబడ్డాను.

వారు:-'లీల మనబిడ్డ కాదంటూఉంటే! మనబిడ్డను మనకు యిచ్చివేస్తారంట'

నేను:-'అదేమో! మనబిడ్డే కావచ్చును. లీలను విడిచి ఉండలేనండి. ఆరేళ్లు యెక్కడనో పెరిగిన బిడ్డను తెచ్చి యెలా పెంచగలను? ఆబిడ్డ నన్ను 'అమ్మా' అని పిలవదే!' అంటూ లేచాను యింటిలోనికి పోవాలని.

వారు:-సరే! అలాగే వ్రాశేమంటాను మరి.

నేను:-ఉండండి! ఆలోచించడానికైన వ్యవధి యిస్తారా?

వారు:-'అవునుమరి! యేమే! కెల్లిది బీరకాయలు తెచ్చింది తీసుకుంటావా? అని వీధిలోనుంచి కేకవేస్తే, వంటింటిలోనుంచే రెండుకానులకి తీసుకోండి అనిజవాబు చెప్పడమా! -బాగా ఆలోచించుకో. నీ మనసుకు యేలానచ్చితే ఆలాగేచేద్దాం. గాని లీలను విడిచి నేను ఉండలేను సుమా! ఆబిడ్డ మనది, యీ బిడ్డకాదు అన్న భేదం నీకుగాని మగవాడిని చిన్నప్పటినుంచి పెంచిన యీ బిడ్డనే, నాబిడ్డగా భావిస్తు ప్రేమిస్తున్నాను. ఆలా ప్రేమించలేను'

నేను:-తిరిగి ఆకుర్చీలో నేను కూర్చుని ఆలోచనలో పడ్డాను. ఇంతలో లీల వచ్చి వొళ్లోవొరిగి నిల్చుని నా ముఖంలోకి చూచి 'అమ్మా! అన్నంపెట్టవే!' అని అడిగింది. బరువైనగుండెతో నాచిట్టితల్లిని ముద్దు పెట్టుకొని యింటిలోనికి తీసుకపోయాను.

వారు భోజనంచేస్తు 'జయా! కడకు యేంటి నిశ్చయించావు?' అని తిరిగి విషయాన్ని కదిపారు.

నేను:-'ఏమి నిశ్చయించ గలనండి? నాతల్లిని విడిచి ఉండగలనండీ! పిల్లలులేరని, పైవారిపిల్లను పెంచినంతమాత్రాన ఆ మమత శాశ్వతంగా నిశ్చలమై ఉండిపోతుందంటారే పెద్దలు! నా రక్తాన్ని పెట్టి పెంచానే నా వల్లనౌతుందండీ యిప్పట్లో విడిచిపెట్టడం? బిడ్డయినా నన్ను విడిచి ఉండగలదండీ? బెంగపెట్టుకొని యేమైపోతుందో!

వారు:-'ఏమైపోతే నీకేం? నీబిడ్డకానప్పుడు?' హేళనగా అన్నారు.

నేను:-మగవాళ్లకు మీకేంతెలుస్తుంది-తల్లిప్రేమ? అందులో స్తన్యమిచ్చి పెంచిన ప్రేమయొక్క లోతు? గాని చాలదూరం ఆలోచించానండి. లీలను వాళ్లకు యిచ్చివేయిడమే మంచిది. ఆ మారుగిల్లు సవరించుకోవడమే అత్యుత్తమమని తోస్తుంది....యీపాడుకబురు యెందుకు చెప్పారండీ? తెలియకుండా ఉంటే బాగుండిపోను!

వారు:-కొన్నాళ్లకయినా తెలియక తప్పదుకదా! ఎప్పుడైనా యీ అవస్థ అనుభవించవలసిందే.

నేను.-ఏమో? అప్పటికి పరిస్థితులు యేలాగుండివుండేవో! యీ సంగతి తెలియకపోతే యేబాధా లేకుండా ఉండేదిగాని, నిజంతెలిశాక, లీలపైనున్న మమత నెమ్మదిగా తగ్గిపోకమానదు. చాలా కొద్దిగా తగ్గుతూవస్తుంది గాని బిడ్డకు యీడు వచ్చేటప్పటికి విరక్తిగూడ బిడ్డపై కలుగకతప్పదు. మన బిడ్డ-మనం చూడనప్పటికి జ్ఞాపకానికి వచ్చేటప్పుడల్లా లీలమీదనున్న ప్రేమ తగ్గుతూవస్తుంది. తగ్గకతప్పదు. మానవుల చిత్తవృత్తి అటువంటిది. తనకు సంతానంలేనప్పుడు పరవారి పిల్లను తెచ్చిసాకుతూ యెంతోగారాబంగా పెంచుతూ ఉన్నసమయంలో తనకడుపున సంతానంకలిగిన వెంటనే ఆపెంపుడు బిడ్డపైనున్న మమత మరలిపోతుంది. తెలివైన స్త్రీ కొంతవరకు లోకాన్ని మెప్పించడానికి బయటపడదు. అంతే! 'నా' అన్నదానిలో అంతటి మహత్తరశక్తి ఉంది. అందునను స్త్రీలయొక్క స్వార్థానికి పరిమితి లేదు. అదిగాక పేగుసంబంధమే! అందుచేత యెవరిబిడను వారు తీసుకోవడమే మంచిది. బిడ్డలకు

మాత్రం యింతవరకు పెంచినవాళ్లపైననే ప్రేమ నిలచిపోతుంది. పెద్దవాళ్లు అయాకగూడ హృదయం నుండి తుడుచుకపోదు. గాని యిప్పట్లోనే విడతీశామంటె ప్రమాదముంది. వాళ్లది పరిస్థితులను అర్థం చేసుకోలేని ప్రాయమాయను.

'అందుకని యీవిధంగా చేస్తే బాగుంటుంది. బిడ్డలకు తొమ్మిదవ యేడు వచ్చేవరకు రెండు కుటుంబాలు కలుసుకొంటు బిడ్డలకు నిజస్థితి తెలియజేస్తు యెడబాటుకై వాళ్లను తయారు చేయాలి. అప్పుడు, వాళ్లకు, మనకు, బిడ్డలకు గూడ అట్టే చిత్తక్షోభ లేకుండా మారుగిళ్లను సవరించుకోవచ్చు' అని నేను సూచించేను.

అప్పటికి మావారి భోజనం పూర్తి అయింది. చేతులు కడుగుకొని లోనికి వెళ్లిపోయారు. నాకు ఆకలే లేకుండాపోయింది. పంచపాత్రెడు మజ్జిగమాత్రం త్రాగి యిల్లు చక్కబెట్టుకవచ్చిశాను. మావారు చావడిలో తాంబూలం వేసుకొంటూ వాలుకుర్చీలో కూర్చున్నారు. ఏమాలోచిస్తున్నారోకాని పెదవులపై చిరునవ్వు తొలంకాడుతూ ఉంది.

చేతనున్న పాలగ్లాసు బల్లపై పెడుతూ ఉండగా మావారు ఫక్కున నవ్వేరు. నేను నివ్వెరపోయి వారివైపు చూశాను. వారు ఆగకుండా గట్టిగా నవ్వుతూ తువ్వాలుతో ముఖంకప్పుకున్నారు. నేను చిన్నబుచ్చుకున్నాను. "బాగానే ఉంది వేళాకోళం" అంటూ కోపంతో యింటిలోనికి వెళ్లబోతుంటే చట్టున నా చేయిపట్టుకొని,

"జయా! యెంతబేలవే!! నిజంగా లీల మనబిడ్డకాదనే అనుకుంటున్నావా? ఇదంతా ఓచిన్న నాటకం ఆడేను. రోజంతా శ్రమచేసి సామగ్రి ఆ దొంగ డాక్యుమెంట్లు, వూరుపేరు తెలియని ఆపాపఫొటో, సంపాదించాను. యిదిగో చదువుకో"అని గృహలక్ష్మి పత్రికను నా చేతికిచ్చారు. "వింత సమస్య-మీకు యే బిడ్డకావాలి?" అని ఉన్నదాన్ని చదువుతూ ఉంటే మనసు కొద్దికొద్దిగా నెమ్మది పడింది.

తేలికగా నవ్వుతూ "బాగానే ఉందండి మీ నాటకం! నేను ఆనుపత్రిలో పురుడు పోయించుకోవడంగూడా అనుకూలించింది"అని పుస్తకం అక్కడ పడవేసి పరుగెత్తుక పోయి మంచం మీద నిద్రపోతున్న నా లీలను-తప్పని తెలిసికూడ-ముద్దు పెట్టుకున్నవరకు మనసు తాలిందికాదు.

వారుకూడా నా వెనుకనే వచ్చి 'జయా! గృహలక్ష్మి పత్రికకు జబాబు జరిగినది జరిగినట్టుగా వ్రాసి పంపించు' అని నవ్వుతూ అన్నారు.

'అలాగేకాని యెంతనిర్భీతిగా ప్రమాణంచేశారండీ! చేతిలో చేయివేసి'

'ఇదంతా నాటకమేకదూ!' అని నవ్వేరు.

—శ్రీ అల్లిక జయలక్ష్మి.

## 2

నా బిడ్డ 'మారుగిల్లు' అయినట్లు ఋజువవగానే నా మనస్సు నాకు పుట్టినబిడ్డకొరకే కొట్టుకుంటుంది. నా అంతరాత్మ ఇలా ప్రబోధిస్తుంది. "నీ రక్తంలో రక్తం, నీ ప్రాణంలో ప్రాణం, పైగా నవమాసాలు మోసి కన్నావు. కర్మవశాత్తు ఆ బిడ్డ మరొకరికి చేరింది. ఈ నాడా సంగతి బయలుపడినప్పుడు నువ్వు ఉపేక్షచేస్తే కలకాలం అటమటిస్తావు. ఇప్పుడు నీవు పెంచే బిడ్డ పెద్దదై నీమాట వినకపోతే నా బిడ్డయితేనామాట వినకపోవునా? అని దుఃఖిస్తావు. పైగా ఎప్పుడన్నా నీ మనస్సుకి కష్టం

కలిగినప్పుడు ఏ అమ్మకన్నబిడ్డో నాపాల బడింది. నా ఖర్మ. అనుకుని వాపోతావు. అదే నీబిడ్డ నయితే ఏ లోటున్నా, ఏ కష్టంవచ్చినా ఏమీ అనుకోవు. బాగా ఆలోచించు. తర్వాత పశ్చాత్తాపపడితే లాభం లేదు" అని. ఈ ప్రబోధం నాకు బాగా నచ్చింది. నా బిడ్డ నెప్పుడెత్తుకుని ముద్దులాడుతానా అనిపించింది. ఏనాడిచ్చిన స్తన్యమో ఈనాడు నాబిడ్డ అగుపడగానే వర్షించింది. వెంటనే పెంచిన బిడ్డను ప్రేమతో ముద్దు పెట్టుకొని ఆ తల్లి కందిస్తాను. నాపాప నందుకొని సుందరమ్మగారూ చూచారూ! పుట్టగానే 'మారుగిళ్ళ' యిన మా పాప ఈనాడు బైటపడింది. ఆ పాపకు తల్లిదండ్రుల పోలికలేమీ లేవనేవారే. ఇదిగో ఈ పాపకి ఆ పెద్ద కళ్లూ, చిన్ని లక్కపిడతలాంటి నోరూ నాతీరేనా? బుగ్గలు చూడండీ ఎలా చొట్టలుపడుతున్నాయో అంతా వాళ్ళ నాన్నగారికి మల్లే! అంటూ వర్ణిస్తూ ముద్దులవర్షం కురిపించి ఇన్నాళ్లెక్కడున్నావమ్మా? అప్పచ్చి పెడతాను దా అని ఆనందిస్తాను. ఏనాటికన్నా కన్నకడుపుకదా! ప్రేమ జాస్తికదూ?

—తాయి రత్నమాల

# 3

ఋషభుని కుమారుఁడగు జడభరతుడు వైరాగ్యముచే దారాపుత్రాదులను తన రాజ్యమునువిడచి అడవికిబోయి తపంబొనర్చుచుండ, ఒకానొకదినంబున స్నానమాచరించి సూర్యమండలాంతర్వర్తియగు శ్రీమన్నారాయణుని ధ్యానించుచున్న సమయమున, సమీపారణ్యమునందలి సింహగర్జనమును వినిన యొక చూలు లేడికి భయముచే గర్భముజారి, గర్భస్థమగు బిడ్డ నీటియందు బడుటయు, తల్లి లేడి గట్టునఁబడి ప్రాణములను విడువ, భరతుడు కనువిచ్చిచూచి, మాతృవిహీనయగు నా కూనను పుత్రవాత్సల్యముతో బెంచుటయును, కొంతకాలమైనపిదప నా లేడి యాతనినివిడచి యెచ్చటకో పోవుటచేత నా రాజఋషి శోకవ్యాకులితహృదయుడై లేడినే మనస్సునందు ధ్యానించుటచే, లేడియై పుట్టెననియు పూర్వజ్ఞానముచేత పశ్చాత్తప్తుఁడై,

ఉ|| రాజులు ప్రస్తుతింప సురరాజసమానుడనై తనూజులన్
రాజులఁజేసి తాపసులు రాజ ఋషీంద్రుడటంచు బల్కగా
తేజమునొంది యీ హరిణదేహమునందలి ప్రీతిజేసి, నా
యోజసెడంగ నేజెడితి యోగిజనంబులలోన బేలనై.

అని విరక్తచిత్తుడై, మూడుజన్మములకు ముక్తినొందెనని భాగవతమునందలి పంచమస్కంధమునఁ జెప్పబడియున్నది. మోక్షమున కంతరాయము గల్గునని విడువరాని దారాపుత్రాదుల విడచిన భరతుని యట్టి మహనీయుడు తిర్యగ్జంతువైన లేడిపిల్లను పెంచుటచేతనే అట్టి అగాధ ప్రేమమయుండై విడువజాలకపోయెనని చెప్పగా ప్రాకృతమందలి సామాన్య స్త్రీలకు పెంచిన బిడ్డపై నెంత ప్రేమ యుండునో చెప్పశక్యమా?

కుంతీదేవి తను కన్న కుమారుని లోకభయముచే గంగపాలుచేసి మాద్రేయులగు నకుల, సహదేవుల, ధర్మరాజాదులకన్న మిక్కిలి ప్రేమించినట్లు మహాభారతములో అనేకముగా చెప్పఁబడియున్నది. అరణ్యమునకు పాండవులును ద్రౌపదియును వెళ్లు సమయమున కుంతి ద్రౌపది నుద్దేశించి సహదేవుడు ఆకలిని తెలిసికొనజాలడు గావున, నీవరసి అన్నముపెట్టుమని చెప్పినది. పిమ్మట ఉద్యోగపర్వమైన శ్రీ కృష్ణుడు రాయబారము చేయవచ్చిన సందర్భములో తానుకూడ కర్ణునితో,

సీ॥ "వినుము సూతాన్వయంబున నీవుపుట్టుట, బొంకేను మాకుంతి భోజునింట
కన్నియనాఁడు భాస్కరుని రావించితి, వరమంత్రబలమున వచ్చియతఁడు
సంప్రీతినొసఁగంగ జన్మించినాడవు, నాకుఁ గావున పాండునందనుండ
వగుదు ధర్మస్థితి నట్టి నీ వితరుల గొలువనేటికి గురుకులవరేణ్య.
గీ॥ ధర్మతనయాదులైనఁ నీ తమ్ములకును ధార్తరాష్ట్రులకును నీవె తగువిభుండ
వేలు మీ లోకమెల్ల నీకేల రాధ కొడుకితండను తక్కువ కొడుకు కుట్టి."

అని ఆమె చెప్పుటయే గాక, సూర్యబింబములోనుండి 'ఇది నిజమిభ్భంగి నెగడవన్న' యను వాక్యములు వినియును, కర్ణుని మనసుకూడ పెంపుడుతల్లియైన రాధయందే భక్తిప్రేమానురక్తమైనట్లును కనుపించుచున్నది.

శ్రీ కృష్ణభగవానుని పెంచిన నంద యశోదల పవిత్రవాత్సల్యమును సాధారణముగా పండిత పామరులందఱును ఎరింగియే యున్నారు. రాజ్యకార్యావసరమున కృష్ణుడు వారిని విడచి మథురకు పోవలసి వచ్చెను గాని లేనిచో శ్రీ కృష్ణునకు వ్రేపల్లెయు, బృందావనము, నంద యశోదల ప్రేమవాత్సల్యములకన్న మథురానగరమును, తన్నాగరులును యెక్కువగాదు.

బ్రహ్మనిష్ఠుడగు కణ్వమహాముని శకుంతలను అపరిమితవాత్సల్యముతో పెంచి, ఆమెను భర్తవద్దకు పంపుసమయమున, మనస్సు నీరుగాగ గద్గదకంఠుఁడై 'తపోధనులమైన మేమే ఇట్లు విలపింపఁగా గృహస్థు లెంత గుందుదురో, అకటా!' అనినట్లు వినుచున్నాము.

మఱియును 'పెంచినప్రేమ యెక్కువ', 'కన్నప్రేమకంటె'నను ఉదాహరణములు వేలు లభించుచున్నవి. అవి అన్నియును సేకరించిన ఒక మహాగ్రంథము కాగలదు.

మఱికొందరు జంతువులనుకూడా పెంచి కన్నబిడ్డలకంటె మక్కువను చూపుచున్నారు. మాకును పెంచినబిడ్డయే కావలెను.

—కొరప్రోలు వెంకటరంగమ్మ.

ఆర్యా,

## 4

వింత సమస్య ఒకనెలదినములు ఆలోచించి జబాబు ఇచ్చుటకు నిశ్చయించితిని. నాకు నాదగ్గర నుండి నాచే పెంపబడిన అనురాగానుబంధములకు గురిఅయిన బిడ్డనే నేను వాంఛింతును. దీనికి కారణము నా పెంచిన ప్రేమ, మాతృప్రేమ. నావద్దనుండి నావద్ద పెరుగుచుండినబిడ్డ నాకు పుట్టినది కాదని ఋజువు అయినప్పటికి నేను కోరినను నాబిడ్డ నాకురాదు. ఒకవేళ నాకుపుట్టినబిడ్డ నావద్దకు వచ్చినను ఆబిడ్డ ఎవరి వద్ద ఇప్పటివరకు ఉండి వారివద్ద సుఖమందుచుండెనో వారివద్దకన్న నావద్ద ఎక్కువ సౌఖ్యమందును అనుటకో తగినన్ని ఆధారములులేవు. చెరిసమానముగా నావద్దనున్నబిడ్డ ఇంకొకరివద్ద ఉండి సుఖమందునను నిశ్చయము లేదు. ఇందుకు నాకు పుట్టినబిడ్డ నావద్దనున్న కన్న ఎక్కువసౌఖ్య మనుభవించుచుండెను అనిన కన్నతల్లికి అంతకన్న సంతోషము మరిఒకటి ఉండదు. కనుక ఏబిడ్డనయితే నాబిడ్డఅనుకొని ఇంతకాలమువరకు పెంచి, ఇంతకాలమువరకు నా ప్రేమమూర్తిని ఇంకొకరికి అప్పగించి నా హృదయము విషాద సముద్రమున నా జీవితమును అర్పించుటకన్న ఆబిడ్డను నావద్దనే ఉంచుకొని నా అనురాగ ప్రేమా మాధుర్యమును నివేద్యము పెట్టు

టకు నేను నిశ్చయింతును. కనుక ఏబిడ్డనయితే నాకు పుట్టినబిడ్డగా భావించి నా ఆత్మకన్న ఎక్కువ గారాబముగాపెంచి, ఆ పెంచినబిడ్డ నాకు ఉద్భవించినది గాదని ఋజువు అయినప్పటికిని ప్రేమింతునో ఆబిడ్డనే నాబిడ్డగా భావించి నాదగ్గరే ఉంచుకొందును. అదియునుగాక నాకు నిజముగా పుట్టినబిడ్డ నా సలహా ప్రకారము పెంపబడునని స్థిరపడినది కావున నాకు పుట్టినబిడ్డ ఎవరివద్దనుండి సుఖపడుచున్నను నాకు లెక్కించవలసిన అవసరములేదు. ఈ విధముగా నేను నిశ్చయించినను ఉభయులు సుఖపడుదురు. నా బిడ్డ, నాకు పుట్టినబిడ్డ ఈ విధముగా చేయుటవలన అందరికిని సమ్మతి. కనుక నేను వాంఛించిన, నావద్దనుండి నాచే పెంపబడిన, నాకు పుట్టినదని నాచే భ్రమింపబడి నా అనురాగమునకు గురిఅయిన బిడ్డనే, నావద్ద ఉంచుకొని మిగిలినబిడ్డను నాకు పుట్టినునసరే నేను విసర్జింతును.

చిత్తగించవలెను,

'చిరంజీవి'

## 5

సర్వ సాధారణముగా ఈ రోజులలో ఏదోయొక కారణముచేత మూడువంతుల కాన్పులు దొరతనమువారి ప్రసూతి వైద్యాలయములలోనే జరుగుచున్నవి. కాని బిడ్డలు తారుగిల్లు మారుగిల్లు కావడమనేది నాకు యొకవింత విషయముగానే తోచుచున్నది. ఏమనగా ప్రసవమైన స్త్రీ కన్నులువిప్పి చూచునప్పటికి ఎదుట వూయలలో యొక రక్తపుగుడ్డువంటి బిడ్డ కండ్ల కగుపడును. ఆ స్త్రీ ఆబిడ్డ తనుపడినశ్రమకు దేవుడు ప్రసాదించిన కానుకయని తలంచుట అందరును ఎరింగిన విషయమేగదా!

యిక నొకవేళ మంత్రసానులు వగైరా వారు యీమెను మోసగించదలచి వుద్దేశ్య పూర్వకముగా అట్లు చేసిననూ యీమెయొక్క అజ్ఞాతావస్థలో జరిగితే జరుగవచ్చునేమో గాని, యొకమారు కండ్లారా తనబిడ్డని చూచినమీదట అట్లు జరగటమనేది అస్వాభావికము, మరియు అసంభవమూనని నా అభిప్రాయము.

ఒకవేళ అటువంటి పొరబాటు వచ్చినదే యనుకొందము. ఏ స్త్రీ ఐనను కన్నుల మూతలు విడని పసికూనను తనబిడ్డడేనని అల్లారు ముద్దుగా ప్రేమతో పెంచి పెద్దవానినిజేసి విడువగలదా? యిదియే మాతృమోహము.

గర్భమోహముకంటె పెంచిన ప్రేమ యెక్కువైనదని గాదా పెద్దలందురు! ఏనాడో కుంతీదేవి కన్నబిడ్డను పెట్టెలోపెట్టి నదిమీద విడవినదంటే ప్రేమలేకనా? కాదు. లోకభయమే యిందుకు ప్రబలతర కారణము యని నా వుద్దేశ్యము.

రాజపుత్రస్థానములోని పన్నాయనుదాసీ యీనాడుకూడ స్మరింపబడుచున్నది. యెందుచేత?

రాజపుత్రులలో అంతఃకలహములు చెలరేగిన సమయమున, శత్రువగు వన వీరసింహుని బారినుండి వుదయసింహుని అతినేర్పుతో బాల్యదశనుండి కాపాడి చివరకు సమయమాసన్నమైనపుడు ఆ వనవీరుని కోపాగ్నికి తనబిడ్డని బలియిచ్చి వుదయుని రక్షింపజేసిన దేదంటే, ఆ పెంచిన పవిత్రప్రేమయే. కాబట్టి లక్షలధనమిచ్చినను స్త్రీ తను ప్రేమించి పెంచిన బిడ్డను విడువజాలదు.

యిది నా హృదయపూర్వక సంతృప్తికరమైన జబాబు.

—శ్రీ మణి.

ఆమె ఆరుసంవత్సరములు చాకినను ఆబిడ్డ తనబిడ్డకాదనియు తనబిడ్డ మరియొకరికి మార్పుజెంది యున్నదనియు పూర్తియైన సాక్ష్యముతో రుజువైై తానుకోరినచో ఇతర స్త్రీవద్దయున్న తనసొంతబిడ్డను తాను పొందగలిగిన ఆబిడ్డనే కోరునుగాని చాకినబిడ్డను కోరదు. ఏలన తనగర్భమున ఉత్పత్తియై జనించిన భ్రాంతి వారిని వదలుట దుర్లభముగదా! తనబిడ్డలు ఎంత దుర్మార్గులైనను ఇతరుల బిడ్డలు తనయందెంత భయ భక్తులతో ప్రేమతో నటించినను వారిమీద తనబిడ్డలమీదకంటె ఎక్కువప్రేమ యుండునా? ఉండదు. తనబిడ్డలు ఎంత కష్టపెట్టుచున్నను, ఎన్నికష్టముల పాల్ జేయుచున్నను వాటినిసహించుచు బిడ్డలక్షేమమునే కోరుచు అనేక తాపత్రయాదులకు లోనగుచున్నారుగదా! కారణము తనగర్భమున జనించిన భ్రాంతియే. కనుక ఆరుసంవత్సరములు చాకినబిడ్డను వాని నిజతల్లికిచ్చివేసియూ కొద్దికాలము చాకిన మరులుండి తదుపరి మరచిపోవునుగాని తన నిజబిడ్డను తెచ్చుకొననిచో చచ్చుపరియంతము నాబిడ్డ అక్కడయున్నాడు వాడు నాబిడ్డయను మరులు విడువబోదు. కనుక తనస్వంతబిడ్డనే కోరును.

—శ్రీ యం. వైదేహమ్మ.

ఎంతప్రేమయుండినను కన్నప్రేమకన్నా పెంచిన ప్రేమయే పెద్దది. ఏలాగంటె మాత కనిన వెంటనే బిడ్డ చనిపోయిన అంతగా శోకము చెందదు. (కని) పెంచి పెద్దచేసి దానియొక్క ఆట, పాటలు అనుభవించి వేరు కావలెనంటే దానికంటే కష్టము వేరొకటిలేదు; కావున తనబిడ్డయే అనుకొని పెంచిన బిడ్డనే వుంచుకొందురు.

—శ్రీ ఆర్. లక్ష్మీదేవి.

నేను జనరల్ వార్డులో ప్రసవించినప్పుడు నాదగ్గిరవుంచిన బిడ్డనుపెంచితినిగనుక అది నా బిడ్డ కాదని రుజువైనప్పటికి నేను పెంచినబిడ్డనే ప్రేమిస్తాను.

—శ్రీ గోపరాజు వెంకటరత్నమ్మ.

మారుగిల్లయిన పిల్లను ఇచ్చివేయడమే మంచిది. ఎందుకనగా బిడ్డ తనదికాదని తెలిసినప్పుడు ఎంతప్రేమతో పెంచినా ఆ మమకారము యథోరీతిగా నిలవడము కష్టము. ఎక్కడోవున్న తనబిడ్డకోసమే మాతృహృదయం ఆరాటపడడం సహజం. అదీకాక తెలియకముందు పెంచినది 6 సంవత్సరములేకదా! 6 సంవత్సరములు ప్రేమతోపెంచిన మమకారముచేత జీవితాంతమువరకు తనబిడ్డ కానివానిని తనబిడ్డగా చూనుకొనేభారము వహించడము చాల కష్టము. ఈ కష్టము ముందు 6 సంవత్సరములు కేవలం పెంచిన మమకారము వదులుకొని ఆబిడ్డను ఇచ్చివేసి తన బిడ్డను చేకొనుట చాల సులభము. ఇంకా అలాగ ఇచ్చి వేయక పెంచినబిడ్డనే వుంచుకుంటే పెదదయిన తరవాత బిడ్డకు తన జన్మరహస్యము బయలుపడకతప్పదు. అప్పుడు బిడ్డ మనస్సుగూడ పెంపుడుతల్లిని వదలి అసలుతల్లికోసం పరుగిడ వచ్చును. ఎటుచూసినా 6 ఏళ్ల అజ్ఞానవయస్సే గనుక పెంచిన ప్రేమకంటె కన్నప్రేమే సహజంగా ఎక్కువగనక 'మారుగిల్ల'యిన పిల్లను ఇచ్చి వేసి అసలు పిల్లను తీసుకొనుటే వుత్తమము.

—ఒక స్త్రీ.

# శ్రీమతి కాళ్లకూరి మహాలక్ష్మీ సుందరమ్మ స్మృతి

## శ్రీ బాలాంత్రపు శేషమ్మగారి గర్భశోకము.

**19-7-1941** శనివారం సాయంకాలము 5 గంటలకు చెన్నపురి గోపాలపురమున కవితిలక కుటీరములో కాళ్లకూరి మహాలక్ష్మి సుందరమ్మగారు పరమపదమును గాంచిరి. ఈ యమ్మ 8 దినములు సన్నిపాత జ్వరము (టైఫాయిడ్)తో బాధపడి తొమ్మిదవ దినమున తన భౌతికశరీరమును విడిచినారు.

## జీవిత విశేషములు

మహాలక్ష్మి సుందరమ్మగారు "హిందూ సుందరి" పత్రికాధిపురాలైన గం॥ భా॥ బాలాంత్రపు శేషమాంబా సతీమణిగారికిన్ని కీ॥ శే॥ సుందరరామయ్య పంతులుగారికిన్ని జనించిన ఏకైక పుత్రికారత్నము. కర్నూలు మునిసిపల్ ఆఫీసు మేనేజరుగానున్న కాళ్లకూరి శేషయ్య పంతులు బి.ఏ. గారి ధర్మపత్ని.

ఈ మహావిదుషీమణి **1914** సం॥ జనన మొందినది. కాకినాడలో తన తల్లిగారిచే స్థాపింపబడిన సంస్కృత పాఠశాలలో సంస్కృతము నాటకాంత సాహిత్యము, కౌముది, ప్రకరణములతో నభ్యసించినది. హిందీ విశారద పరీక్షలో నుత్తీర్ణురాలైనది. ఆంగ్లభాష యింటివద్దనే అభ్యసించి కాశీ విశ్వవిద్యాలయమున మెట్రిక్యులేషన్ యింటరుమీడియేట్ పరీక్షలలో ఘనముగా నుత్తీర్ణురాలైనది. మద్రాసు విశ్వవిద్యాలయములో రాజధానికళాశాలలో ప్రభుత్వమువారి ఉపకారవేతనముపై సంస్కృతము ఎం. ఏ. పరీక్షలో **1937** సం॥ ఉత్తీర్ణురాలైనది. 1938 సం॥లో ఎల్.టి. పరీక్ష పూర్తిచేసినది. ఏలూరులో స్త్రీ పాఠశాలకు ప్రధానోపాధ్యాయురాలుగా నొక సంవత్సరము పనిచేసినారు.

**1940** లో తెలుగు ఎం. ఏ. పరీక్షలో కృతార్థురాలైనది. **1940** సెప్టెంబరు మొదలు 6 మాసములు మద్రాసు మేరీరాణీ స్త్రీకళాశాల విదుషీమణి శ్రీమతి కవితిలక కవితా విశారద కాంచనపల్లి కనకాంబగారు సెలవు పుచ్చుకొనగా వారిస్థానమున 100రూ॥ జీతముమీద ఆంధ్రసహోపన్యాసకురాలుగా పనిచేసిరి. ప్రకృతము రెండు మాసములనుండి కర్నూలులో స్త్రీసమాజము స్థాపించి వారమునకు రెండు మహాసమావేశములు జరుపుచు సీతారామాంజనేయ భారతజీవయాత్రాది గ్రంథములు చదివి వ్యాఖ్యానముచేయుచు ప్రచారము చేయుచున్నారు. ఈయమ్మ సంస్కృతములో గద్యపద్య కవిత్వ మసాధారణముగ చెప్ప నేర్చినది. గీర్వాణములో గొన్ని స్తోత్రములును, కనకాంబావిరచిత హంసవిజయనాటకమునకు సంస్కృతానువాదము మొదలగు గ్రంథములను రచించినది. శ్రీ శంకరులవారి ఖండగ్రంథములలో ప్రబోధసుధాకరము మొదలగు చిన్న గ్రంథములను ఆంధ్రములో వచనముగా ననువదించిరి. శ్రీ కనకాంబాకృత జీవయాత్రాద్యాంధ్ర వేదాంతప్రబంధములకు సుబోధమగు వ్యాఖ్యానము రచించినది.

ఈ విదుషీమణి సంస్కృతాంధ్రాంగ్లహిందీభాషలయందు మృదుమధురముగా ప్రసంగము చేయజాలినది. ఈ సాధ్వీమణికి 27 సం॥ లకే నూరేండ్లు నిండుట దేశదౌర్భాగ్యము. మరణకాలమున నిశ్చింతగా నాప్తులమధ్య భగవత్ కీర్తన జరుగుచుండగా తాను స్వయముగా రామనామము జపముచేయుచు నిర్భయముగా శరీరత్యాగము చేసిన ధీరురాలు. రావుబహద్దూరు మంత్రిప్రగడ నరసింహంపంతులుగారు, దేవగుప్తాపు శేషగిరిరావుగారు, నడిమింటి గణేశ్వరరావుపంతులుగారు మొదలగువారి కుటుంబ బంధువులు, కావలి సీతారామయ్య పంతులుగారు, తల్లిగారు, భర్త, బంధువులు, నాప్తులందరి సన్నిధిలోను యుండి భగవద్ధ్యానము చేయుచుండిరి. ఈ యమ్మ యాత్మకు శాంతి కలుగుగాక! అగాధ దుఃఖసముద్రమున మునిగియున్న తల్లి బాలాంత్రపు శేషమ్మగారికిని, శేషయ్యగారికిని మా హృదయపూర్వకమగు సానుభూతిని తెలియజేయుచున్నాము.




## హిందూ వివాహ సంస్కరణము

హిందువులలో వివాహాల సందర్భంలో హిందూ లా ప్రకారం ఉన్నటువంటి అసౌకర్యములను, ఆటంకములను తొలగించుటకుగాను కేంద్రశాసనసభలో డాక్టరు జి. వి. దేశముఖ్ గారు ప్రవేశపెట్టిన బిల్లు ప్రజాభిప్రాయార్థము సర్కులేటు చేయబడుచున్నది. ఈ బిల్లు సారాంశాలు ఉద్దేశముగూర్చి దేశముఖ్ గారు పత్రికలలో ఒక విపులమైన వ్యాసమును ప్రచురించినారు.

ఇది ఎట్టి బలవంత సంస్కరణమును చేయ తలపెట్టిన బిల్లు కాదనీ, హిందువులలో ఒకేవర్ణమునకు చెందిన వివిధశాఖలలోను అంతర్వివాహములు జరుగుటకును అవి న్యాయశాస్త్రసమ్మతమగున ట్లవకాశమిచ్చుటకును, ఒకే గోత్రమునకు ప్రవరకు చెందిన వివిధకుటుంబముల మధ్య వివాహములకు ఆటంకము తొలగించుటకు ఉద్దేశింపబడినదని దేశముఖ్ గారు వివరించిరి. అయితే 'సపిండ' అభ్యంతరము తొలగిపోవక అట్లే నిలిచియుండును కావున ఎట్టి ప్రమాదమును లేదని సమర్థించిరి. తండ్రివంక ఏడుతరముల - తల్లివంక ఐదుతరముల 'సపిండ' అంతర్వివాహములు నిషిద్ధమనుట సిద్ధముగ నున్నదిగదా, యిక సగోత్ర సప్రవర వివాహములకు ఆటంకములేల యుండవలెననిరి. ఇంకను, ఉదాహరణమునకు బ్రాహ్మణులలోని వివిధశాఖలవారును - నాడులవారును భేదములేకుండా అంతర్వివాహములు చేసుకొన్నచో సంబంధములకు అవకాశములు సువిశాలమై, యిదేవిధముగ హిందూజాతి యావత్తు ఘననిబద్ధము (consolidate) కాదా యనిరి. రక్తబంధుత్వమునకును గోత్ర ప్రవరలకును సంబంధమున్నట్లు నిర్ధారింప వీలులేదనిరి. వివిధరాష్ట్రములలోను బ్రహ్మ క్షత్రియ వైశ్యుల (ద్విజుల) లోను ఒకేగోత్రమునకు చెందిన కుటుంబములవారున్నట్లు ఋజువు చెప్పిరి.

'మితాక్షరము'లో వివాహసంబంధమైన సూత్రములలో గోత్రప్రశంసయే లేదనిరి.

మొత్తముమీద ఈ హిందూ వివాహముల అసౌకర్యముల నివారణచేయు బిల్లు సౌకర్యములను సదుపాయములను కలుగజేయు బిల్లుగాని ఎవరికీ ఎట్టి నిర్బంధమును బలవంతమును చేయు బిల్లు కాదనిరి. వివాహయోగ్య వధూవర నిర్ణయమునకు హెచ్చు విశాలసంఘము ఇందువల్ల ఏర్పడుట కవకాశముండుటవల్లను కన్యావరశుల్కముల ధరలును పడిపోవుటకు వీలుకలుగునను యుక్తివాదమును చేసిరి.

హిందూ లాలో వివాహమునుగూర్చిన నియమములలో సంస్కరణలు తేబూనిన ఈ బిల్లు, యావత్తు హిందూ లా సమగ్రముగ పునఃసంస్కరింపబడువరకు - ఎంతో దీర్ఘకాలమువరకు - వేచియుండనక్కరలేదని, సత్వరముగ చట్టము చేయబడవచ్చుననియు, ఇందువల్ల హిందూ లా యొక్క మరెట్టి శాఖయు ప్రత్యక్షముగగాని పరోక్షముగగాని బాధింపబడదనియు దేశముఖ్ గారు స్పష్టపరచిరి.

నిష్పక్షపాతముగ యోచించి చూచువారికి దేశముఖ్ గారి వివాహ సంస్కరణలబిల్లు సమంజసముగను సహేతుకముగను ఆచరణయోగ్యముగనే కనపడును. హిందూసంఘ బలాభివృద్ధులను పునరుజ్జీవనమును జాతీయైక్యతను కోరు దేశాభిమానులు ఇందుగూర్చి శ్రద్ధగా యోచించి తమ అభిప్రాయములను ప్రకటించు టవసరమని హెచ్చరించెదము.

## మూడవతరగతి స్త్రీ ప్రయాణికుల యిబ్బందులు

స్త్రీ పురుష వ్యత్యాసములేక, అసలు మూడవతరగతి రైల్వే ప్రయాణికుల యిబ్బందులు అసౌకర్యములు జగద్విదితములై దీర్ఘకాలముగ సంస్కరణను కోరుచున్నవి. ఇందుగూర్చి లెక్కలేనన్ని సారులు పత్రికలలో ఆందోళన జరుగుచునే యున్నది. అందులో, స్త్రీ ప్రయాణికుల కొఱకైన మూడవతరగతి బండ్లలోని యిడుమలు మరీ ప్రత్యేకశ్రద్ధ అవసరమైనట్టివి.

'బొంబాయి క్రానికల్' ఆంగ్ల దినపత్రికలో మిస్ ఎ. బ్రౌన్ అనునామె ఒక బహిరంగలేఖను ప్రకటించిరి. బొంబాయి—మద్రాసు ఎక్స్‌ప్రెస్ రైలుబండ్లలోని ఇరకటము త్రొక్కిడిగూర్చి ఈమె జాలికరముగ వ్రాసినది. దీర్ఘప్రయాణముకొఱకేర్పడిన ట్రెయినుకు అంతటికిని ఒక్కొక్కప్పుడు ఒక్కే 3వ తరగతి స్త్రీలపెట్టె యుండుట శోచనీయమని ఈమె వ్రాసినది. 30 సీట్లుగల యీ పెట్టెలో 45 మంది స్త్రీలు, అనేకమంది బిడ్డలు, చాలా అధికము సామాను ఎక్కవలసిన దురవస్థ కలుగుటయు, ఆ పెట్టె అంతటికి ఒకే పాయిఖానా దొడ్డి యుండుటయు ఘోరమైన అసౌకర్యమని ఈమె మొరపెట్టుకొనినది. ఆ కంపార్టుమెంటులోని స్థితి ఎంత అసంతృప్తికరముగను ఎంత అపరిశుద్ధముగను ఉండునో ఊహింపవచ్చును. ఒక్కొక్క ట్రెయినుకు రెండో మూడో స్త్రీల కంపార్టుమెంటులు వేయరాదా? ఏ 26 ఘంటలసేపో ప్రయాణము జరుగు ఆ బండ్లను అక్కడక్కడ పాకీ నౌకర్లచేత రైయిల్వేవారు తుడిపించి బాగు చేయించరాదా?

పూనా మెయిలు మొదలగు ట్రెయినులలో పరిస్థితులు చాలా బాగున్నవనియు, ఎమ్. ఎస్. ఎమ్. రైల్వేవారు మరింత శ్రద్ధతీసుకొని స్త్రీలకు హెచ్చు సౌకర్యములు చేకూర్చవలెనని ఈయమ్మతోపాటు మేమును అధికారులకు హెచ్చరిక చేయుచున్నాము.

## భిక్షుకసమస్యా నివారణ - మహిళామణుల సహాయము

మదరాసులో కుదురని రోగములతో బాధపడుచున్న భిక్షుకులకు శరణాలయ భవనమొకటి ప్రజల ధనసహాయముతో నిర్మింపబడినట్లయిన, కార్పొరేషనువారు దాని నిర్వహణార్థము 15000 రూపాయిలు ఖర్చుచేయుటకు నిర్ణయించి కేటాయించి యుంచిరి.

శ్రీమతి అమ్మస్వామినాధన్ సతి అధ్యక్షతకింద ఈమధ్యజరిగిన అఖిలభారత మహిళామహాసభా మద్రాసుశాఖా కార్య నిర్వాహకవర్గ సమావేశములో, ఈ భిక్షుకశరణాలయ గృహనిర్మాణార్థము వెంటనే పూనుకొని వీలయినంత అధికధన సహాయమును చేకూర్చుటకై ప్రయత్నింప తీర్మానించుకొనిరి. ఇందుగూర్చి ఒక ఉపసంఘము ఏర్పాటు చేయబడినది.

ఇంతేకాక బిడ్డల సంరక్షణార్థమైన తొండియార్పేటలోని మదరాసు సంఘభవనములో నిర్వహింపబడుచున్న బిడ్డల విద్యాలయమునకు వెనుకటివలెనే ఈ సంఘమువారు తమ సహాయమును ఇచ్చుచుండెదమని నిర్ణయించుకొనిరి.

బిచ్చగాండ్లకు బిడ్డలకు రక్షణయొసంగుట మాతృహృదయమునకు సహజమైన విధియేగదా. వీరి శ్రమ ఫలించగలదనే మేము ఆశింతుము.

Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao,
at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.